# సమాజ విజ్ఞాన

# వ్యాసావళి - 3

2691/R

121/3-83



Acc. No. 9527

సంపాదకుడు

**పి. సత్యనారాయణ**

సౌత్ ఇండియా పబ్లికేషన్స్

హైదరాబాద్

# సమాజ విజ్ఞాన
# వ్యాసావళి - 3

2691/k

121/3-83



Acc. No. 9527

సంపాదకుడు

**పి. సత్యనారాయణ**

సౌత్ ఇండియా పబ్లికేషన్స్
హైదరాబాద్

SAMAJA VIGNANA VYASAVALI-

Edited by

P. Satyanarayana

Acc. No - 9527

1983

Price : Rs 15

South India Publications

C-10/1, Kakateeya Nagar

Hyderabad-500 007.

# వి ష య సూ చి క


1. ప్రధాన రాజకీయ ఘట్టాలు 1

—జి. వెంకటరామారావు

2. విధాన మండలి 39

—ఎం. రాంచందర్

3. మంత్రి వర్గాలు 53

—ఎం. సత్యనారాయణరావు

4. పార్టీల బలాబలాలు 66

—కె.వి. నారాయణరావు

# రచయితలు


జి. వెంకట రామారావు

—విద్యా విస్తరణ అధికారి

మేడ్చల్ పంచాయతీ సమితి

ఎం. రాంచందర్

—ఉస్మానియా విశ్వవిద్యాలయం

రాజనీతిశాస్త్ర శాఖలో టీచర్ ఫెలో

ఎం. సత్యనారాయణరావు

—ఉస్మానియా విశ్వవిద్యాలయం

రాజనీతిశాస్త్ర శాఖలో టీచర్ ఫెలో

కె. వి. నారాయణరావు

—జాతీయ గ్రామీణాభివృద్ధి సంస్థలో

డెప్యూటీ డైరెక్టర్

# ప్రధాన రాజకీయ ఘట్టాలు

- జి. వెంకట రామారావు

1712లో చిన్ ఖిలీజ్ ఖాన్ స్థాపించిన నిజాం రాజ్యం 1948 సెప్టెంబరు 17వ తేదీన పోలీసుచర్య సమాప్తంతో అంతరించింది.

విజేతగా వచ్చిన మేజర్-జనరల్ జయంతనాథ చౌధరీ 1948 సెప్టెంబరు 18వ తేదీన రాష్ట్ర ప్రభుత్వ బాధ్యతలు చేబట్టాడు. హోదా బట్టి మిలటరీ గవర్నరే అయినా పరిపాలన సివిల్ పద్ధతిలోనే నడిచింది. మేజర్-జనరల్ చౌధరీ మంత్రివర్గం:- 1) మేజర్-జనరల్ చౌదరీ (మిలిటరీ గవర్నర్), 2) పి. ఎస్. భక్లే (సివిల్ అడ్మినిస్ట్రేటర్), 3) నవాబ్ జైన్ యార్ జంగ్, 4) రాజా ధోండేరాజ్, 5) పి. వి. ఎస్. రావు, 6) సి. హెచ్. కృష్ణారావు (సభ్యులు).

చౌధరీ ప్రభుత్వం రాష్ట్రంలో అనేక సంస్కరణలను ప్రవేశ పెట్టింది. 1948 లోనే రాష్ట్రంలో భూసంస్కరణల యుగం ప్రారంభమైంది. 1949 ఆగస్టు 15న మొదలుపెట్టిన జాగీర్దారీ రద్దు కృషి తొమ్మిది నెలల స్వల్ప వ్యవధి లోనే పూర్తయింది. 1949 ఫిబ్రవరి మాసంలో నిజాం స్వంత ఆస్తి సర్ఫేఖాస్ దివానీలో లీనమైంది. సంస్థానాలు, పాయిగాలు, జాగీర్లు, సర్ఫేఖాస్‌తో కూడిన నాల్గంచెల ఫ్యూడల్ వ్యవస్థ ఒక్క సంవత్సరం తిరక్కుండానే కుప్పగా కూలి పోయింది. మిలటరీ గవర్నరు ప్రభుత్వంలో స్టేటు కాంగ్రెస్ నాయకులకు స్థానం లభించలేదు. ఇది స్థానిక కాంగ్రెస్ నాయకులను ఇరకాటంలో పెట్టింది. రాష్ట్రంలో ప్రజా ప్రభుత్వం ఏర్పడాలని స్టేటు కాంగ్రెస్ నాయకులు పదే పదే లేవదీసిన ఆందోళనల ఫలితంగా మిలటరీ గవర్నరు పరిపాలనపోయి 1950 జూన్ 12వ తేదీన ఎం. కే. వెల్లోడి సారథ్యంలో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడింది.

# వెల్లోడి మంత్రివర్గం

వెల్లోడి మంత్రివర్గ సభ్యులు :- 1) ఎం. కె. వెల్లోడి (ముఖ్యమంత్రి), 2) నవాబ్ జైన్ యార్‌జంగ్, 3) ఎం. శేషాద్రి, 4) సి.వి.ఎస్. రావు, 5) బూర్గుల రామకృష్ణారావు 6) వి.బి. రాజు, 7) పూల్‌చంద్ గాంధీ, 8) వినాయకరావు విద్యాలంకార్ (సభ్యులు). చివరి నల్గురు మంత్రులు స్టేటు కాంగ్రెస్‌వారు. భారత రాజ్యాంగ సభకు 15 మంది సభ్యులను 1950 లో నామినేట్ చేసారు. వారి పేర్లు :- 1) కుమారి పద్మజానాయుడు, 2) కాశీనాథరావు వైద్యా, 3) కొండా వెంకటరంగారెడ్డి, 4) డా॥ ఎం. చెన్నారెడ్డి, 5) పులి రామస్వామి, 6) జె.హెచ్. సుబ్బయ్య, 7) జములాపురం కేశవరావు, 8) అరిగె రామస్వామి, 9) అన్నారావు మానిక్‌లాల్ గుప్తా, 10) పన్నాలాల్ పిట్టీ, 11) ఎం.వి. నాయక్, 12) అబ్దుల్ హసన్ సయ్యద్ అలీ, 13) బాకర్ అలీమిర్జా, 14) హరిశ్చంద్ర హేడా, 15) జి. రామాచారి.

ఈ రోజుల్లో తెలంగాణా కమ్యూనిస్టులు జరిపిన సాయుధ పోరాటం ప్రపంచ వ్యాప్తికెక్కింది. ఉపప్రధాని సర్దార్ పటేల్ దీన్నెంతో తీవ్రచర్యగా తీసుకొని కెప్టెన్ నంజప్ప ఆధ్వర్యంలో ప్రత్యేక సైనిక దళాలను నియమించాడు. దౌర్జన్యానికి ప్రతి దౌర్జన్యం ప్రారంభించిన పోలీసులు కమ్యూనిస్టు ఉద్యమాన్ని అదుపులోకి తెచ్చారు. 1950 అక్టోబర్ 6వ తేదీన సర్దార్ పటేల్ హైదరాబాద్ పర్యటనలో ఫతేమైదానంలో బ్రహ్మాండమైన ప్రజానీకాన్ని ఉద్దేశించి ప్రసంగిస్తూ, తానీ గడ్డపైన ఒక్క కమ్యూనిస్టునైనా వదలిపెట్టనన్నాడు. రెండేళ్ళలో అన్నంతపనిచేసి చూపించాడు.

స్వాతంత్ర్య సమరంలో స్వామి రామానందతీర్థ (స్వామిజీ) సారథ్యంలో పోరాడిన ప్రజాపక్షాలన్నీ స్వాతంత్ర్య సమర ఫలితం అనుభవించే సమయం రాగానే భాగాలకోసం ప్రయత్నించినవి. స్టేటు కాంగ్రెస్‌లో అతివాద, మితవాద, వర్గాలు మొదటినించి ఉన్నవే. అతివాద పక్షానికి స్వామిజీ నాయకుడు. వి.బి. రాజు సర్దార్ జములాపురం కేశవరావు, మాడపాటి రామచంద్రరావు ఈ గ్రూపులో సీనియర్ నాయకులు. పి.వి. నరసింహారావు, జలగం వెంగళరావులు స్వామిజీ గ్రూపులోని వారే. మితవాద వర్గానికి బూర్గుల, రంగారెడ్డి ఉమ్మడి నాయకత్వం వహించారు. చెన్నారెడ్డి యీ గ్రూపులోనివారే. దీనికి

తెలంగాణా కర్నాటకలో మంచి బలం ఉండేది. ఇరు గ్రూపులమధ్య తగాదా లెక్కువైనాయి. రంగారెడ్డి, రామకృష్ణారావు, రామాచారి, వైద్యలను పార్టీనుంచి సస్పెండ్ చేశాడు స్వామిజీ. వీరంతా పోటీ కాంగ్రెస్‌ని పెట్టుకొని జనార్ధనరావు దేశాయిని అధ్యక్షునిగా, బూర్గులను కార్యదర్శిగా చేసుకొన్నారు. అప్పట్లో స్టేటు కాంగ్రెస్‌లోని ఈ రెండు గ్రూపులను ప్రజలు గోసాయి, దేశాయి పార్టీలని పిలిచేవారు. 1948లో పండిత నెహ్రూ హైదరాబాద్ వచ్చినప్పుడు ఈ రెండు గ్రూపుల తగాదాలతో విసుగుచెందినా పరిష్కరించలేకపోయాడు. ఈ బాధ్యత సర్దార్ పటేల్‌పైన బడింది. సర్దార్ హైదరాబాద్ వచ్చి 1949 జనవరి 10వ తేదీన ఇరు వర్గాలను సమావేశపరచి, వర్కింగు కమిటీలో ఉభయ గ్రూపులకు సమాన ప్రాతినిధ్యమిచ్చి, స్వామిజీ అధ్యక్షతన నూతన వర్కింగ్ కమిటీ ఏర్పాటు చేసాడు. అంతటితో పోటీ కాంగ్రెస్ ఒక్కటేగాక, హైదరాబాద్ స్టేటు కాంగ్రెసుకుగల స్వతంత్ర ప్రతిపత్తికూడా అంతరించి అది అఖిలభారత కాంగ్రెస్ కమిటీకి అనుబంధ సంస్థగా మారింది. హైదరాబాద్ స్టేటు కాంగ్రెస్‌కు స్వామిజీ తరువాత రంగారెడ్డి, బిందూ, మల్లప్ప, జె.వి. నరసింగరావు వరుసగా అధ్యక్షులైనారు.

ఈ విభేదాలవల్ల స్టేటు కాంగ్రెస్ బాగానే నష్టపోయింది. పోలీసు చర్య జరిగిన రెండేళ్ళకుగాని రాష్ట్ర మంత్రివర్గంలో స్టేటు కాంగ్రెస్‌కు స్థానం లభించ లేదు. అదికూడా పాక్షికమే. స్వతంత్ర భారతదేశంలోని రాష్ట్రాలలో రాష్ట్రే తర వారితో మంత్రివర్గం ఏర్పడటం ఒక్క హైదరాబాద్ చరిత్రలోనే జరిగింది.

స్వభాష, స్వరాష్ట్రంపై ఎంతో మక్కువగల హైదరాబాద్ రాష్ట్ర ప్రజలను పాలించిన ముఖ్యమంత్రులలో సర్ అలీ ఇమామ్, సర్ అక్బర్ హైదరీ, నవాబ్ చత్తారీ మిర్జా ఇస్మాయిల్, జనరల్ చౌధరి, ఎం.కె. వెల్లోడిలు హైదరాబాద్ వారుకారు. వారు గైర్ ముల్కీలే. అందులో ముల్కీ ఉద్యమానికి ప్రాముఖ్యమిచ్చిన నిజాం నవాబు ఉస్మాన్ అలీఖాన్ హయాంలోని ముఖ్యమంత్రులే. ఇదంతా ప్రజలు మరచిపోయినా చరిత్రకారులు మరచిపోలేరు.

హైదరాబాద్ రాష్ట్ర శాసనసభకు జరిగిన తొలి తుది ఎన్నికల ఫలితాలు యిలా ఉన్నాయి :- కాంగ్రెస్ 93, పీపుల్సు డెమొక్రాటిక్ ఫ్రంటు 42, సోష లిస్టు 1, ఇండిపెండెంట్లు 29. ఎన్నికల నాటికి కమ్యూనిస్టు పార్టీపై నిషేధం

తొలగనందున ఇతర ప్రజాస్వామ్య వామపక్షాలతో కలిసి ఈ పార్టీ పీపుల్స్ డెమొక్రాటిక్ ఫ్రంటు పేర పోటీ చేయవలసివచ్చింది. నల్గొండ జిల్లాలోని మొత్తం 14 స్థానాలను కమ్యూనిస్టులు గెల్చుకొన్నారు. మాడపాటి హనుమంత రావు, జములాపురం కేశవరావు, సురవరం ప్రతాపరెడ్డివంటి అగ్రనాయకులు సామాన్య కమ్యూనిస్టు అభ్యర్థుల చేతుల్లో ఓడిపోయారు.

## బూర్గుల మంత్రివర్గం

ఎన్నికల్లో మెజారిటీ సంపాదించుకొన్న కాంగ్రెస్ పార్టీకి నాయకుని ఎన్నిక సమస్య ఎదురైనప్పుడు స్వామిజీ బిందూ పేరును ప్రతిపాదించారు. రాష్ట్రంలో సగం జనాభాకు ప్రాతినిధ్యం వహిస్తున్న ఆంధ్రులకే నాయకత్వం లభించాలని రంగారెడ్డి వాదించారు. కాంగ్రెస్ అధిష్ఠానవర్గం పిలుపుపై ఇరుపక్షం నాయకులు ఢిల్లీ వెళ్ళి నాయకుణ్ణి నిర్ణయించుకొని వచ్చారు. బూర్గుల రామకృష్ణారావుకు ముఖ్యమంత్రి పదవి, ఆయనతో పోటీ చేసిన బిందూకు హోం మంత్రి పదవి లభించాయి. రామకృష్ణారావు మంత్రివర్గ సభ్యులు :- 1) రామకృష్ణారావు (ముఖ్య మంత్రి), 2) దిగంబర్‌రావు బిందూ, 3) కె.వి. రంగారెడ్డి, 4) వినాయకరావు విద్యాలంకార్, 5) డాక్టర్ జి.ఎస్. మెల్కోటే, 6) నవాబ్ మెహదినవాజ్‌జంగ్, 7) ఫూల్చంద్ గాంధీ, 8) వి.బి. రాజు, 9) ఎం. చెన్నారెడ్డి, 10) అన్నారావు గణముఖీ, 11)జగన్నాథరావుచంద్రగీ, 12)శంకర్‌దేవ్, 13) దేవీసింగ్‌చౌహాన్, (మంత్రులు). కొంతకాలం తర్వాత ముఖ్యమంత్రితో సరిపడక ఫూల్చంద్ గాంధీ, జగన్నాథరావు చంద్రగీ, వి.బి. రాజు, దేవీసింగ్ చౌహాన్‌లు రాజీనామా చేయగా ముఖ్యమంత్రి కోరికపై ఒక్క చౌహాన్ మాత్రమే రాజీనామా ఉపసంహ రించుకొన్నారు. తర్వాత ఎనిమిది మంది మంత్రులను నియమించారు ముఖ్య మంత్రి గోపాలరావ్ ఎక్బోటే, కాబినేట్ హోదాగల మంత్రి, అరిగె రామస్వామి, శ్రీమతి సంగం లక్ష్మీబాయమ్మ, శ్రీనివాసరావు యెక్కేకర్, భగవంతరావు గాడే, ఎం.ఎస్. రాజలింగం, పల్లెర్ల హనుమంతరావు ఉపమంత్రులయ్యారు.

రామకృష్ణారావుకు ముఖ్యమంత్రి పదవి నల్లేరుపై బండి నడక కాలేదు. ఆయనకు వ్యతిరేకంగా అనేక విమర్శలు ప్రధాని నెహ్రూవరకు పోయినవి. వీటి విచారణకు నెహ్రూయే హైదరాబాద్ రావలసివచ్చింది. బూర్గులకు అసెంబ్లీలో బలం ఉందోలేదో నిరూపించుకొనటానికి అవకాశమిస్తూ నెహ్రూ శాసనసభ్యులతో

రహస్య వోటింగ్ పెట్టించారు. 200 మంది సభ్యులు పాల్గొన్న ఈ ఓటింగులో బూర్గులకు కేవలం ముగ్గురు మాత్రమే వ్యతిరేకంగా వోటుచేశారు. ఒక గండం తప్పింది. ఆంధ్ర మహాసభల కాలంనాటినుంచి ప్రాణస్నేహితులుగా ఉంటున్న బూర్గుల, రంగారెడ్డిలమధ్య మంత్రివర్గ నిర్మాణం నాటినించి వైరాలు ప్రారంభమై అవి లోలోన తీవ్రమౌతూ రావు-రెడ్డి వర్గాలుగా బైటకి వచ్చాయి.

రాజకీయాలలో స్నేహాలు, శత్రుత్వాలు శాశ్వతంగా ఉండవు. గర్భ శత్రువులు, గాఢస్నేహితులు అనేవారు ఈ రంగంలో చాలా అరుదు. పొత్తులు కుదుర్చుకోవటం, అంతలోనే దూరమవటం రాజకీయాలలో సర్వసామాన్యం. రామకృష్ణారావు-స్వామిజీల సఖ్యం రామకృష్ణారావు-రంగారెడ్డి విభేదం అలాంటిది. ఖాళీ అయిన ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి వెనుకబడిన తరగతుల అభ్యర్థిగా బూర్గుల-స్వామిజీ వర్గాలు తిరిగి మల్లప్ప కల్లూరును నిలబెట్టాయి రంగారెడ్డి వర్గం జె. వి. నరసింగరావును నిలబెట్టింది. ఇరుపక్షాలవారు మహా తీవ్రంగా ప్రచారాలు చేసుకొన్నారు. అధికార అభ్యర్థికి వోటు చేయవలసిందని ప్రధాని నెహ్రూనించి తాఖీదుకూడా వచ్చింది. జె.వి. నరసింగరావు తొమ్మిది ఓట్ల ఆధిక్యంతో స్టేటు కాంగ్రెస్ అధ్యక్షులైనారు. జె.వి. ని గెలిపించి రాష్ట్ర రాజకీయాల్లో డాక్టర్ చెన్నారెడ్డి తన బలప్రదర్శన జరిపారు. కేంద్రంలో నెహ్రూ పటేల్ మధ్యన గ్రూపులున్నప్పుడు, స్వామిజీ నెహ్రూ గ్రూపును, రంగారెడ్డి వర్గం సర్దార్ గ్రూపును రాష్ట్ర స్థాయిలో బలపరిచేవారు.

## స్వామిజీ-బిందూ వర్గాల పోటీ

హైదరాబాద్ రాష్ట్ర రాజకీయాలలో తెలంగాణా, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతీయ విభేదాలు మొదటినుంచి ఉన్నవే. ఈ విభేదాలు ఆయా జిల్లాల స్థాయిలో పెద్దగా కన్పించకపోయినా రాష్ట్ర స్థాయిన జరిగే ప్రతి ఎన్నికల్లో దీని ప్రభావం కనిపించేది. తెలంగాణా పేరుతో బూర్గుల, రంగారెడ్డి, మరాఠ్వాడా కర్నాటక పేరుతో స్వామిజీ, బిందూ అగ్రశ్రేణి అభ్యర్థులుగా పోటాపోటీలు పడేవారు. మరొకవంక విశాలాంధ్ర, సంయుక్త మహారాష్ట్ర ఐక్య కర్నాటక పేర్లతో భాషా ప్రయుక్త రాష్ట్ర ఆందోళనలు కొనసాగుతుండినవి. దీనికి స్వామిజీ నిరంతరం సుముఖుడే. రంగారెడ్డితో తేడాలు వచ్చిన తర్వాత బూర్గుల స్వామిజీ వర్గాన్ని మంచి చేసుకోవలసి వచ్చినా ఆంధ్రులు, మహారాష్ట్రులు,

కన్నడిగుల మధ్య అంతర్గత వైరాలు పోలేదు. దీనికి తోడు ఆ రోజుల్లో శాసన సభలో పి.డి.ఎఫ్. బలమైన ప్రతిపక్షంగా ఉండేది.

## పి. డి. ఎఫ్. లో విభేదాలు

రాష్ట్రంలో పీపుల్స్ డెమొక్రాటిక్ ఫ్రంటు ప్రతిపక్షంలో కూడా ఐక్య భావం పెద్దగా కన్పించలేదు. డాక్టర్ జయసూర్య, ధగేలకు, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి, సర్వదేవరభట్ల రామనాథం మున్నగువారి మధ్య సమన్వయం కుదరలేదు. ప్రధాని నెహ్రూ ప్రత్యేక దూత ద్వారకానాథ్ కచ్రూ హైదరాబాద్‌కు వచ్చినప్పుడు నెహ్రూ ప్రభుత్వాన్ని కూలద్రోయటమే ధ్యేయంగా పెట్టుకొన్న వర్గం ఆయనతో చర్చలకు నిరాకరించింది. ఈ చర్చలకు సహాయ పడటానికి ముందుకువచ్చిన డాక్టర్ జయసూర్య కృషి ఫలించలేదు. పి.డి ఎఫ్. సభ్యులమధ్య దినదినానికి విభేదాలెక్కువై అది నామమాత్రపు వేదికగా మిగిలింది. వారి వాదానికి విసుగుచెంది డాక్టరు జయసూర్య పార్టీ సభ్యత్వానికి రాజీనామా చేశాడు.

## సోషలిస్టులు

ఇకపోతే తెలంగాణాలో ఎస్. బి. గిరి, మహదేవ్‌సింగ్‌లాంటి కార్మిక నాయకులు సోషలిస్టు పార్టీ స్థాపనకు కొంత ప్రయత్నించారు. వీరి కార్యరంగం కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలకు మాత్రమే పరిమితమైనది. సాధారణంగా గ్రామీణ ప్రాంతాల రాజకీయాలు ఎన్నికల్లో గెలిచిన శాసనసభ్యుల ఆధీనమై ఉంటాయి అందువలన గ్రామీణ ప్రాంతాలలో ఈ పార్టీ పెరుగలేకపోయింది. ఎన్నికల్లో పోటీ చేయటానికి సోషలిస్టు పార్టీకి ఎప్పుడూ డబ్బు సమస్య ఎదురవుతూనే ఉండేది. ఆ తాకిడికి తట్టుకోలేక ఈ పార్టీ శాసనసభలో తన సంఖ్యను పెంచుకోలేకపోయింది.

## పండిత్ నెహ్రూ ఆగ్రహం

కల్లోలితమైన హైదరాబాద్ రాష్ట్ర రాజకీయాలు దాని విభజన దారిని సుగమం చేశాయి. దేశంలో భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణంపని ఆలస్యంగా జరిగినా హైదరాబాద్ రాష్ట్రాన్ని వెంటనే విభజించి తెలుగు మాట్లాడే జిల్లాలను

మద్రాసులోను: మరాఠ్వాడా, కర్నాటక జిల్లాలను బొంబాయిలోను కలిపివేయవల సిందని నిజామాబాద్‌లో జరిగిన స్టేటు కాంగ్రెస్ సమావేశంలో స్వామిజీ ప్రతిపాదించగా దాన్ని కార్యవర్గం బలపరిచింది. 1953 లోనే హైదరాబాద్‌లో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశంలో స్వామిజీ ఈ సూచనను మళ్ళీ చేయగా పండిత నెహ్రూ కోపోద్రిక్తుడై హైదరాబాద్ యథాతథంగా 'బి' రాష్ట్రంగానే ఉంటుందన్నారు.

## ఫజలాలీ కమీషన్ సూచన

పెక్కు ఒత్తిడులకు లోనైన కేంద్ర ప్రభుత్వం ఫజుల్ అలీ అధ్యక్షతన రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సంఘాన్ని నియమించింది. హైదరాబాద్ విభజన అనివార్యం అనే అభిప్రాయాన్ని ఈ సంఘం ప్రకటించింది. "అత్యధిక ప్రజలు రాష్ట్ర విభజన కోరుతున్నారు. తెలంగాణాను ప్రత్యేక రాష్ట్రంగా చేయాలని విశాలాంధ్రలో కలపాలని కోరుతున్న కాంగ్రెస్‌లోని రెండు వర్గాలుకూడా హైదరాబాద్ విభజనే వాంఛిస్తున్నది. మరాఠ్వాడా ప్రాంతంలో విభజనను వ్యతిరేకించినవారు ఒకరైనా మాకు కన్పించలేదు" అని ఈ సంఘం వెలిబుచ్చిన అభిప్రాయాలు గమనార్హమైనవి.

స్టేటు కాంగ్రెసులోని స్వామిజీ-బూర్గుల వర్గాలు విశాలాంధ్రను బలపరిచినవి. ఆదిలో తెలంగాణాకు మద్దతు యిస్తానన్న బూర్గుల ఢిల్లీకి పోయివచ్చి మారిపోయాడని రంగారెడ్డి వాదన. దీనికి గోవింద వల్లభ్ పంత్ చాలావరకు కారకుడంటారు. ఎవరి ప్రచారాలు వారు చేసుకొన్నారు. ఐదేళ్ళవరకు తెలంగాణాను ప్రత్యేక రాష్ట్రంగా ఉంచితే ఈ అయిదేళ్ళకాలం విశాలాంధ్ర, ప్రత్యేక వాదుల రగడతోనే గడిచిపోతుందని దూరదృష్టితో వాదించి బూర్గుల తన వాదనను అసెంబ్లీలో నెగ్గించుకొన్నారు. తాము ప్రధాని నెహ్రూ వ్యక్తిత్వానికి లొంగి విశాలాంధ్రను అంగీకరించామంటారు చెన్నారెడ్డి. ఒక పెద్ద మనుషుల ఒప్పందంతో తెలంగాణా ప్రాంతం ఆంధ్ర రాష్ట్రంలో కలిసిపోయింది. ఇక్కడ మరొక విచిత్రమైన సంగతి జరిగింది. ఆదినుండి భాషా రాష్ట్రవాదులకు పట్టుకొమ్మగా నిలిచిన స్వామిజీకిగానీ, అతికీలక సమయంలో విశాలాంధ్రను బలపరచిన రామకృష్ణారావుకుగానీ ఆంధ్రప్రదేశ్ రాజకీయాలలో స్థానమే లభించలేదు. స్వామిజీ ఔరంగాబాద్ నుంచి లోక్‌సభకు పోటీ చేయగా, కేరళ గవర్నరై బూర్గుల రాష్ట్రం

విడిచిపెట్టిపోయారు. హైదరాబాద్ రాష్ట్ర విచ్ఛిన్నంతో నిజాం నవాబు రాజ ప్రముఖ్ పదవి రద్దయిపోయింది.

## ఆంధ్ర రాష్ట్రోద్యమం

ఆంధ్ర ప్రాంతం బ్రిటీషు పరిపాలనలో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని భాగంగా ఉండేది. 1801 లో నిజాం నవాబు తన రాజ్యంలోని బళ్ళారి, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలను ఈస్టిండియా కంపెనీకి దత్తం చేశాడు. అందుకే అవి దత్తమండలమైనది. 1911 లో చిత్తూరు జిల్లా ఏర్పడ్డాక ఈ ఐదు జిల్లాలను దత్తమండలంగా వ్యవహరిస్తూ వచ్చారు. ఈ పేరు బాగుండలేదని డాక్టరు చిలుకూరి నారాయణరావు 'రాయలసీమ' అని నామకరణం చేశారు. అదే పేరు స్థిరపడిపోయింది. సర్కారు జిల్లాలుకూడా ఒకప్పుడు నిజాం రాజ్యంలోనివే. రాజకీయపరంగా నెల్లూరును రాయలసీమతో జతపరుస్తున్నారు.

ఇంకా కొంచెం వెనక్కు వెళ్ళితే ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణా అంతా కుతుబుషాహీ నవాబులవే గోల్కొండ రాజ్యంలో ఐదు సుభాలుండినవి. మొదటి సుభాలో మహమ్మద్‌నగర్, మెదక్, కౌలాస్, మలకన్నూరు జిల్లాలు; రెండవ సూభాలో ఎల్లందల్, ఖమ్మంమెట్టు, దేవరకొండ జిల్లాలు, మూడవ సుభాలో పానుగల్లు, కొండపల్లి, భువనగిరి, ఆకర్కు జిల్లాలు; నాల్గవ సుభాలో కోయిలకొండ, ఘనపురం, గుంటూరు జిల్లాలు; ఐదవ సుభాలో నిజాంపట్నం ఏలూరు, రాజమండ్రి, శ్రీకాకుళం జిల్లాలుండేవి. ఇంత చరిత్ర ఉన్నా ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలు ప్రత్యేక రాష్ట్రాలు కావాలని ప్రచారం చేసేవారికి చరిత్రతో సంబంధంలేదు. నిజాం నవాబును బలహీనపరచటానికి బ్రిటీషువారు పన్నిన కుట్రనుంచి తెలుగుజాతి తొందరగా తెలుసుకోలేకపోయింది.

మద్రాసు రాష్ట్రంలో ఉండగా ఆంధ్ర రాజకీయాలు ఆంధ్రకేసరి ప్రకాశం. డాక్టరు పట్టాభి సీతారామయ్య, ఆచార్య రంగాలమధ్య కీచులాటలతో నడిచినవి. 1913 లోనే ఆంధ్రులు తమకు ప్రత్యేక రాష్ట్రం కావాలని తడాదిగా ఏటేటా ఆంధ్ర మహాసభలు జరుపుకున్నారు. 1918లో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ఏర్పడింది. 1926లో ఆంధ్ర విశ్వవిద్యాలయం ఏర్పడగా రాయలసీమవారు ఇది తమకక్కర లేదని మద్రాసు విశ్వవిద్యాలయంలోనే ఉండిపోయారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడినప్పుడు తెలంగాణావారు కోరిన రక్షణలు క్రొత్తవికావు. ఇలాంటి ఒడంబడికలు రాయలసీమవారు కూడా కోరారు. అదే శ్రీ బాగ్ ఒడంబడిక.

## సంజీవరెడ్డి గెలుపు

1946లో గాంధీజీ అభిమతానికి విరుద్ధంగా ఆంధ్ర కేసరి అవిభక్త మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రి అయినారు. కానీ ఒక సంవత్సరం తిరక్కుండానే ప్రకాశం మంత్రి వర్గం పడిపోయింది. ప్రకాశం పంతులు ముఖ్యమంత్రి అయినప్పుడు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ యాజమాన్యం ఆచార్య రంగాకి అప్పగించారు. 1951లో రాష్ట్ర కాంగ్రెస్ ఎన్నికలు జరిగినవి. ప్రకాశంగారి పక్షాన తమ అనుయాయుల పక్షాన ఆచార్య రంగా పోటీచేస్తే మంత్రివర్గీయుల పక్షాన మంత్రి పదవికి రాజీనామా చేసి నీలం సంజీవరెడ్డి పోటీ చేశారు. నాల్గు ఓట్ల తేడాతో ఆచార్య రంగా ఓడిపోయారు. సంజీవరెడ్డి గెలుపు రాష్ట్ర రాజకీయాలలో గొప్ప మలుపును తెచ్చింది. ఓడిపోయిన రంగా కృషిక్ కార్ లోక్ పార్టీ (కె.ఎల్.పి.) ని స్థాపించుకోగా, ప్రకాశం పంతులు కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీలో చేరిపోయారు.

కాంగ్రెస్ పార్టీలోని యీ అంతఃకలహాల వలన 1952 ఎన్నికల్లో యీ పార్టీకి ఘోర పరాజయం సంభవించింది. మద్రాసు అసెంబ్లీలో ఆంధ్రప్రాంతానికి 138 స్థానాలుండినవి. కమ్యూనిస్టులు ఈ ఎన్నికలలో 41 స్థానాలను గెలుచుకోగా, కాంగ్రెస్ వారికి 38 సీట్లే లభించాయి. సర్కారు జిల్లాలలో కమ్యూనిస్టులు కె. ఎల్. పి. వారే ఎక్కువ స్థానాలను గెలుచుకొన్నారు. మద్రాసు నుండి పోటీ చేసిన ఆంధ్రకేసరి కూడా యీ ఎన్నికల్లో ఓడిపోయారు. తమిళులు తెలివైనవారు. ప్రకాశంగారు గెలిస్తే ఆంధ్రులు మద్రాసును వదలరనుకొన్నారు. ఈ సలహా యిచ్చినవారు రాజాజీ. మద్రాసు తగాదాలో ఉండగా రాష్ట్ర విభజన అపాయకరమని బ్రిటిషువారుండగానే గవర్నరుతో రాజాజీ ఇండియా కార్యదర్శికి ఒక లేఖ వ్రాయించినారు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కోసం ఒక ఉద్యమంగా పోరాడుతున్న కమ్యూనిస్టులు తమకు అధికారం లభిస్తే ఆంధ్ర రాష్ట్ర అవతరణ జరిగినట్లేనని ప్రచారం చేసుకొన్నారు. ఆంధ్ర రాష్ట్రం కోరుతున్న ప్రజలు కమ్యూనిస్టులకు వోటుచేశారు.

ఆంధ్ర రాష్ట్ర సాధనకు దీక్షగా పనిచేసిన ప్రముఖుల్లో డాక్టర్ పట్టాభిదే అగ్ర తాంబూలం. థార్ కమీషన్ వ్యతిరేకంగా రిపోర్టు యిస్తే తాను జైపూర్ మహాసభ కాంగ్రెస్ అధ్యక్షుడైనపుడు కాంగ్రెస్ తరఫున ఒక ఉపసంఘాన్ని నియమించారు. అదే జె. వి. పి. కమిటీ. 1949 ఏప్రిల్‌లో యీ కమిటీ సమర్పించిన సిఫారసుల్లో ఆంధ్ర రాష్ట్ర ఏర్పడాలని ఉంది. 1952 ఆగస్టు 15న స్వామీ సీతారాం 36 రోజుల నిరసన దీక్షబూనారు. కానీ అది ప్రయోజన శూన్యమైనది. 1952 అక్టోబరు 19వ తేదీన మహాత్ముని శిష్యుడు పొట్టి శ్రీరాములు ఆమరణ ఉపవాసదీక్ష 58 రోజులు సాగింది. శ్రీరాములు అమరత్వంతో ఆంధ్ర ప్రపంచం భగ్గుమంది. దీని ఫలితంగా 1953 అక్టోబరు 1వ తేదీన ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది.

## ఆంధ్ర రాష్ట్ర తొలి మంత్రివర్గం

1952 ఎన్నికల్లో ఓడిపోయిన సంజీవరెడ్డి రాజ్యసభ సభ్యులైనారు. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన నాటికి శాసన సభ్యత్వం లేని శ్రీ సంజీవరెడ్డి, అడ్డూరి బలరామరెడ్డి రాజీనామా చేయగా కాళహస్తి నియోజకవర్గం నుంచి ఎన్నికై శాసన సభ కాంగ్రెస్ పార్టీ నాయకులైనారు. ఈలోగా కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీ సోషలిస్టు పార్టీగా మారిపోయింది. కురువృద్ధుడు ప్రకాశంగారుండగా తాను ముఖ్యమంత్రి గావటం యిష్టపడని సంజీవరెడ్డి ప్రకాశంగారిని వొప్పించి ముఖ్య మంత్రిగా చేసారు. పి.ఎస్.పి. దీనికి వ్యతిరేకించింది. ప్రకాశం పి.ఎస్.పి.ని వీడి, కాంగ్రెస్‌లో చేరిపోయారు. ఆయన పార్టీ ప్రజా పార్టీగా రూపొందింది దానికి తెన్నేటి విశ్వనాథం అధ్యక్షులైనారు. రంగాగారి కె.ఎల్.పి కి ప్రకాశం గారి మంత్రివర్గాన్ని కె ఎల్.పి., బలపరచటం వలన మంత్రివర్గ నిర్మాణ సమయంలో గౌతు లచ్చన్న అందులో చేరిపోయారు. తర్వాత రాజధాని విషయంలో అభిప్రాయభేదం వచ్చి ఆయన రాజీనామా యిచ్చినారు. ఆంధ్రలో మొదటిసారి ఏర్పడ్డ ప్రభుత్వం కాంగ్రెస్– ప్రజా పార్టీ మిశ్రమ ప్రభుత్వం. కమ్యూనిస్టు పార్టీ, ప్రజా సోషలిస్టు పార్టీ, కె ఎల్.పి , ప్రతిపక్ష స్థానంలో కూర్చున్నాయి. నీలం సంజీవరెడ్డి ఉప ముఖ్యమంత్రి పదవి స్వీకరించడంతో ఆయన స్థానంలో బెజవాడ గోపాలరెడ్డి ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులైనారు. ప్రకాశం మంత్రివర్గ సభ్యులు: 1) టి. ప్రకాశం (ముఖ్యమంత్రి), 2) నీలం సంజీవరెడ్డి (ఉప ముఖ్యమంత్రి), 3) తెన్నేటి విశ్వనాథం, 4) గౌతు లచ్చన్న, 5) కడప కోటిరెడ్డి, 6) పెద్దిరెడ్డి

తిమ్మారెడ్డి, 7) దామోదరం సంజీవయ్య, 8) ఎస్.బి.పి. పట్టాభిరామారావు (మంత్రులు). నల్లపాటి వెంకటరామయ్య - స్పీకరు. పట్టాభి ఆంధ్ర రాజకీయ రంగం నుండి నిష్క్రమించి మధ్యప్రదేశ్ రాష్ట్రానికి గవర్నరుగా నియమితు లయ్యారు. అఖిల భారత కాంగ్రెస్ కార్యదర్శి పదవి నుండి కళా వెంకటరావు ఆంధ్రకు వచ్చారు.

ప్రకాశంగారి మంత్రివర్గం 13 నెలలు కొనసాగింది. మద్యపాన విషయం పై ప్రభుత్వం శాంతి రామమూర్తి సంఘాన్ని నియమించింది. ఈ సంఘం 1954 మార్చి 2వ తేదీన సమర్పించిన నివేదికలో మద్యపాన నిషేధాన్ని రద్దు పరచమన్నది. ప్రభుత్వం అందుకు సిద్ధంగా లేదు. నిషేధం రద్దుపరచనందుకు ప్రభుత్వంపై అవిశ్వాస తీర్మానం ప్రవేశపెట్టారు లచ్చన్న. సంజీవరెడ్డి ప్రత్యర్థి యైన శ్రీ నాయకంటి శంకరరెడ్డి, అడుసుమిల్లి సుబ్రహ్మణ్యం వ్యతిరేకంగా ఓటు చేయడం వలన ప్రకాశంగారి ప్రభుత్వం ఓడిపోయింది. దీన్ని ప్రకాశం గారి ఓటమికన్నా సంజీవరెడ్డి ఓటమే అని అనాలి.

## ఆంధ్ర రాష్ట్రంలో మధ్యంతర ఎన్నికలు

ఆంధ్ర కేసరి ప్రభుత్వం పతనమైన వెంటనే రాష్ట్రంలో 1954 నవంబరులో రాష్ట్రపతి పరిపాలన ప్రవేశపెట్టబడింది. 1955లో మధ్యంతర ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికల్లో కె.ఎల్.పి. ప్రజా పార్టీలతో కాంగ్రెస్ చేతులు కలిపింది. నియోజక వర్గాల పునర్విభజనతో 140 నుండి వీటిసంఖ్య 194కు పెరిగింది. అధికారం తమకు లభిస్తుందన్న ఆశతో కమ్యూనిస్టులు ఎన్నికల రంగంలో దిగారు. ప్రధాని నెహ్రూ, కాంగ్రెస్ అధ్యక్షుడు ఢేబర్, ఎస్. కె. పాటిల్ వంటి అధిష్ఠానవర్గ నాయకులు కాంగ్రెస్ పక్షాన ప్రచారం చేశారు యునైటెడ్ కాంగ్రెస్ పార్టీ 147 స్థానాలను సంపాదించుకుంది. ఆంధ్ర నేషనల్ పార్టీకి 19, కమ్యూనిస్టు పార్టీకి 13, సోషలిస్టు పార్టీకి 12, ఇండిపెండెంట్లు 2 స్థానాలు, పి. ఎస్. పి. ఒక స్థానాన్ని గెలుచుకో గలిగాయి. మళ్లీ నాయకత్వపు పోటీ వచ్చింది. అధిష్ఠానవర్గ జోక్యంపై బెజవాడ గోపాలరెడ్డి ముఖ్యమంత్రి అయినారు. నీలం సంజీవరెడ్డి ఉప ముఖ్యమంత్రిగా ఉండిపోయారు. ఆర్. లక్ష్మీ నరసింహ దొర స్పీకరుగా ఎన్నికైనారు.

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ముఖ్యమంత్రి కాగానే ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్ష పదవి ఖాళీ అయినది. 1954 జూన్ నెలలో ఎన్నికలు జరిగినవి. గోపాలరెడ్డి మాజీ కె ఎల్.పి. వారితో కలసి ఆచార్య రంగాను నిలబెట్టారు. రంగా అప్పుడు విదేశాలలో పర్యటిస్తున్నారు. సంజీవరెడ్డి మద్దతుతో అల్లూరి సత్యనారాయణరాజు పోటీకి నిలబడ్డారు. అల్లూరి గెలిచారు. అంటే గోపాలరెడ్డి సంజీవరెడ్డి చాటున ఉండి పోటీ చేయించగా సంజీవరెడ్డి పక్షం నెగ్గింది. సంజీవరెడ్డి రాష్ట్ర శాసనసభకు ఎన్నికైనపుడు రాజ్యసభలో ఖాళీ వచ్చింది. ఆ స్థానంలో సత్యనారాయణరాజు రాజ్యసభకు ఎన్నికైనారు. కొంతకాలం సంజీవరెడ్డి – అల్లూరి "కృష్ణార్జునులు"గా మెలగినారు.

## ఆంధ్రప్రదేశ్ అవతరణ

పెద్దమనుషుల ఒప్పందానికి ముల్కీ చరిత్ర కారణభూతం కనుక ఈ చరిత్ర గురించి కొంత తెలుసుకోవాలి. ఇది ఒక ముఖ్యమంత్రి పునాదులను కదిలించింది. ఇద్దరు ముఖ్యమంత్రులను పదవీచ్యుతులను చేసింది.

ముల్కీ ఉద్యమం: నిజాం పరిపాలనలో తెలంగాణా, మరాఠ్వాడా, కర్నాటక ప్రాంతాలు సమిష్టిగా ఉన్నప్పుడు 16 జిల్లాలుగా హైదరాబాద్ రాష్ట్రం ఉన్న రోజుల్లో ఉర్దూ రాజభాష. ఉస్మానియా స్థాపనకు ముందు చాలా మంది ఉత్తరాది ముస్లింలు ఇక్కడికి వచ్చి ఉద్యోగాలు సంపాదించుకొనేవారు. లక్నోలో ఉర్దూకు అరణ్యరోదన పట్టినప్పుడు నిజాంలు దక్కనులో దాన్ని పోషించారు. స్థానికుల ఉద్యోగావకాశాలు తగ్గిపోయాయి. ప్రజల ఒత్తిడిపై నిజాం నవాబు 1916 లో ముల్కీ ఫర్మానా జారీ చేశాడు దాని ప్రకారం నిజాం సర్వీసులోని ఉద్యోగాలన్నీ ముల్కీలకే లభించాలి. అవసరమనుకొన్న వారికి ముల్కీ సర్టిఫికేటు మినహాయింపు ఇచ్చే నిబంధన ఉంది.

మనకు సాంస్కృతిక కేంద్రం లేదు: 1948 పోలీస్ చర్య తర్వాత మధ్యప్రదేశ్, బొంబాయి, మద్రాసు, మైసూరు నుంచి సివిల్ టీమ్ పేర చాలా మంది అధికారులే వచ్చారు. వారిలో కొంతమంది దురుసుగా ప్రవర్తించే వారని చెడ్డపేరు వచ్చింది. 1953 లో బూర్గుల హయాంలో హింసాయుతమైన ముల్కీ ఉద్యమం బయలుదేరింది. కాల్పులు జరిగాయి. పండిత నెహ్రూ పరుగెత్తుకుంటూ వచ్చి ఫతేమైదానంలో ప్రజలకు హితవు చెప్పారు. "నేను అలహాబాద్‌లో

జన్మించాను. ఇగ్లాండులో చదువుకొన్నాను. ఇప్పుడు ఢిల్లీలో ఉంటున్నాను. ఇక చెప్పండి నేఏ ప్రాంతం ముల్కీని?" అని ఒక సమ్మోహనాస్త్రం వది లాడు. సద్దుమణిగింది.

కానీ లోలోన నిప్పురగుల్కొంటునే ఉంది. ఈ ముల్కీ ఉద్యమమే ఫజల్ అలీ కమిషన్ ముందు ప్రత్యేక తెలంగాణాగా రూపందాల్చింది. వెనుకటి హైదరా బాద్ రాష్ట్రంలోని మహారాష్ట్రులు, కన్నడిగులు తాము కొత్త రాష్ట్రంలో చేరి పోతే తమకు రక్షణలు కావాలని కోరలేదు దానికి స్వామీజీ చాలావరకు కార కుడు. భాషా ప్రయుక్త రాష్ట్రాలకు స్వామీజీ చేసిన సేవ మహాగొప్పది. ఆయ నను హైదరాబాద్ ప్రకాశం అని అన్నారు సంజీవరెడ్డి. మహారాష్ట్రులు, కన్నడి గులు పోతూ పోతూ ముల్కీ పదాన్ని మూసీనదిలో వదిలిపెట్టి పోగా ఆ సంప దకు తెలంగాణావారు వారసులైనారు. మూడు ప్రాంతాలలో ఒకటి మాత్రమే లేవదీసిన ముల్కీ వాదాన్ని ఫజల్ అలీ సంఘం అంగీకరించటానికి చారిత్రికమైన కొన్ని కారణాలున్నాయి. మహారాష్ట్రులందరికీ పూనే సాంస్కృతిక కేంద్రం. అలాగే కన్నడిగులందరికీ మైసూరు. ఆంధ్రులు చాలాకాలం నిజాంలోను, మద్రాసు రాష్ట్రంలోను ప్రభుత్వాధికారం లేకుండా ఉండిపోవడంవలన వారి ప్రాచీన సాంస్కృతిక కేంద్రాలైన వరంగల్, బెజవాడ, గుంటూరులు ఆ స్థానాన్ని కోల్పోయాయి అవసరమైనప్పుడు గురుత్వాకర్షణ శక్తినిచ్చే బలమైన కేంద్రం లేకపోవడంవలన తెలుగు ప్రజలమధ్య భావసమైక్యం కొరవడింది. ఐదు సంవత్సరాల తర్వాత ఈ విషయం ఆలోచించవచ్చని సిఫారసు చేసింది రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సంఘం. పెద్దమనుషుల ఒప్పందంతో ఈ సమస్యకు తాత్కా లిక పరిష్కార మార్గం లభించింది.

పెద్ద మనుషుల ఒప్పందంపై సంతకం చేసినవారు ఆంధ్ర తరపున బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డి, అల్లూరి సత్యనారాయణరాజు, గౌతు లచ్చన్న, తెలంగాణా తరపున బూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకట రంగారెడ్డి, మర్రి చెన్నారెడ్డి, జె.వి. నరసింగరావు.

1956 నవంబరు ఒకటవ తేదీన వచ్చిన దీపావళి ఆంధ్రావళికి దివ్యదీపా వళి అయినది. నూట యాభై సంవత్సరాల తర్వాత తెలుగు ప్రజలంతా ఏక రాజ్యం క్రిందికి వచ్చారు. రాష్ట్ర నాయకత్వానికి బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డి పోటీ చేశారు.

ఆంధ్రప్రదేశ్ నిర్మాణంతో తొమ్మిది జిల్లాల తెలంగాణా ఒక కొత్త శక్తిగా రూపొందింది. కొండా వెంకట రంగారెడ్డి దూరాలోచనాపరుడు. నిజాయితీగల వ్యక్తిగా ప్రసిద్ధి. ఆయన అభిప్రాయమేమంటే అద్దరి ఇద్దరి రెడ్లు పోటీ పడుతుంటే ఇద్దరి వారు తటస్థంగా ఉండాలి. గెలిచినవారు తమవైపే వస్తారు. ఈ సలహా చెన్నారెడ్డికిగానీ. జె.వి. నరసింగరావుకుగాని నచ్చలేదు. చెన్నారెడ్డివర్గం గోపాలరెడ్డిని బలపరచగా, జె.వి వర్గం సంజీవరెడ్డిని బలపరిచింది. బూర్గులవర్గం కూడా సంజీవరెడ్డికే వోటు చేసింది. ఫలితంగా నవరాష్ట్ర నిర్మాత స్థానాన్ని నీలం సంజీవరెడ్డి గెలుచుకొన్నారు సంజీవరెడ్డి మంత్రివర్గం సభ్యులు :- 1) నీలం సంజీరెడ్డి (ముఖ్యమంత్రి), 2) బెజవాడ గోపాలరెడ్డి, 3) కొండా వెంకటరంగారెడ్డి, 4) కళా వెంకటరావు, 5) ఎస్.బి.పి. పట్టాభిరామారావు, 6) జె.వి. నరసింగరావు, 7) వి.బి. రాజు, 8) పి. తిమ్మారెడ్డి, 9) నవాబ్ మెహదీ నవాజ్ జంగ్, 10) డి. సంజీవయ్య, 11) ఎం. నరసింగరావు, 12) కె. బ్రహ్మానంద రెడ్డి, 13) గ్రంథి వేంకటరెడ్డి నాయుడు, 14) అనగాని భగవంతరావు (సభ్యులు) : అయ్యదేవర కాళేశ్వరరావు స్పీకరుగాను, కొండాలక్ష్మణ్ బాపూజీ డిప్యూటీ స్పీకరుగాను ఎన్నికైనారు.

## కాంగ్రెస్ బలం

1957 లో తెలంగాణాకు మాత్రమే అసెంబ్లీ ఎన్నికలు జరిగినవి. ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్‌కు తిరుగులేని అధికారం లభించింది. ఎన్నికల అనంతరం కూడా సంజీవరెడ్డి పూర్వపు మంత్రివర్గాన్నే ఉంచుకొన్నారు. 1958 ఏప్రిల్‌లో బెజవాడ గోపాలరెడ్డి కేంద్ర ఆర్థిక శాఖ సహాయ మంత్రిగా నియమితులు కావటంతో ఢిల్లీకి వెళ్ళిపోయారు. ఎన్నికల కమీషన్ ఇచ్చిన తీర్పుపై వి.బి. రాజు 1959 మార్చి 6వ తేదీన మంత్రి పదవికి రాజీనామా చేయవలసివచ్చింది.

## విధాన పరిషత్తు అవతరణ

ఆంధ్రప్రదేశ్ ఏర్పడితే 72 మంది సభ్యులతో ఒక ఎగువ సభ ఏర్పడాలని 1956 ఏప్రిల్ 5వ తేదీన కర్నూలు శాసనసభ ఆమోదించింది. ఈ సభలో సభ్యుల సంఖ్యను 90 వరకు పెంచారు. దాన్ని 1958 జూలై 7వ తేదీన రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ ప్రారంభించారు. మాడపాటి హనుమంత

రావు ఎగువసభ అధ్యక్షులైనారు. విధానసభలో సీటు దొరకని కాంగ్రెస్ వాదు లకు విధాన పరిషత్తు స్థానమైంది.

## డెమొక్రాటిక్ పార్టీ

సంజీవరెడ్డిని వ్యతిరేకించిన తిరుగుబాటు కాంగ్రెస్ వాదులంతా కలసి డెమొక్రాటిక్ ఫ్రంటు పెట్టుకొన్నారు. దానికి చెన్నారెడ్డి నాయకుడు. ఖమ్మం నుండి బొమ్మకంటి సత్యనారాయణ, వరంగల్‌నుండి హయగ్రీవాచారి, నిజామా బాద్ నుండి శ్రీనివాసరావు, కృష్ణానుండి కాకాని వెంకటరత్నం, శ్రీకాకుళంనుండి గౌతు లచ్చన్న, గుంటూరునుండి మంతెన వెంకటరాజు, జాగర్లమూడి చంద్ర మౌళి, కర్నూలునుండి కందుల ఓబులరెడ్డి ఈ పార్టీలో చేరారు. తర్వాత సోష లిస్టుపార్టీ నాయకుడు పి.వి.జి. రాజు చేరాడు. దానితో డెమొక్రాటిక్ పార్టీ సోషలిస్టు డెమొక్రాటిక్ పార్టీగా మారింది

1959 లో స్వతంత్రపార్టీ పుట్టింది. డెమొక్రాటిక్ ఫ్రంట్‌లోని రంగా వర్గం అందులో చేరిపోయింది పి.వి.జి రాజుకు మంత్రి పదవి ఇవ్వజూపి అందులోనుంచి వేరు జేశారు ముఖ్యమంత్రి. సంజీవరెడ్డి రాష్ట్రంనుంచి వెళ్ళి పోగానే కాకాని, చెన్నారెడ్డి ప్రభృతులు కాంగ్రెస్‌లో చేరిపోవటంవలన కొత్త పార్టీ అదృశ్యమైంది. హైదరాబాద్‌లో ఆచార్యరంగా జన్మదిన సందర్భంగా రాజాజీ చేసిన ఉపన్యాసాన్ని డాక్టర్ చెన్నారెడ్డి అనువదించారు. స్వతంత్ర పార్టీలో ఆయన చేరుతారని అనుకొన్నారు కాని చేరలేదు.

దాదాపు ఒక అర్థ శతాబ్దం తెలుగు దేశమే తానుగా, తానే తెలుగుదేశంగా జీవించిన ఆంధ్రకేసరి ప్రకాశం 1956 ఏప్రిల్ 10వ తేదీన హైదరాబాద్‌లో కన్నుమూశారు. అపరచాణక్యుడని పేరుపొందిన కళా వెంకటరావు 1959 మార్చిలో స్వర్గస్థులైనారు. మధ్యప్రదేశ్ గవర్నర్ పదవి విరమణ తర్వాత విశ్రాంతి జీవితము గడుపుతున్న మహామేధావి డాక్టర్ పట్టాభి సీతారామయ్య 1959 డిసెంబరు 17వ తేదీన మరణించారు.

## కాంగ్రెస్ అధ్యక్షుడుగా సంజీవరెడ్డి

1959 నవంబరు నెలలో ప్రధాని నెహ్రూ ఆంధ్రప్రదేశ్ పర్యటించి సంజీవరెడ్డి పరిపాలనను మెచ్చుకొన్నారు. అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్ష

పదవినుంచి శ్రీమతి ఇందిరాగాంధీ త్వరలో విరమించుకోనున్నది. ఈ పదవిలో సంజీవరెడ్డిని కూచోపెట్టాలని నెహ్రూ అనుకొన్నారు. దానికి పూర్వరంగం సిద్ధ పరచినవారు అఖిలభారత కాంగ్రెస్ కార్యదర్శిగా ఉన్న అల్లూరి సత్యనారాయణ రాజు. 1951 లో నాటి అఖిలభారత కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడైన బాబూ పురుషోత్తందాస్ టాండన్‌తో నెహ్రూకు తగాదా ఏర్పడినప్పుడు కాంగ్రెస్ కార్యదర్శి హోదాలో ఉన్న కళా వెంకట్రావు పురుషోత్తందాస్ టాండన్‌ని బలపరచగా ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఉన్న సంజీవరెడ్డి నెహ్రూను బలపరచి, నెహ్రూ పక్షానికి ఆంధ్రలో విజయం చేకూర్చిపెట్టినారు. శ్రీమతి ఇందిరాగాంధీతో ఆలోచన చేయగా అందుకామె సమ్మతించింది. బెంగుళూరు కాంగ్రెస్ అధ్యక్ష పదవిని అలంకరించవలసిందని సంజీవరెడ్డి ఆహ్వానించారు. స్వరాజ్యం వచ్చిన తర్వాత కాంగ్రెస్ అధ్యక్ష పదవి అలంకార ప్రాయం మాత్రమే. ముఖ్యమంత్రి పదవితో పోల్చితే అది తీసికట్టు. త్యాగం చేయటం సంజీవరెడ్డికి ఇది కొత్తకాదు. 1951లో ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పోటీ చేసినప్పుడే మంత్రి పదవిని వదలుకొన్నారు. 1959 డిసెంబరు నెలలో ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేసిన సంజీవరెడ్డి అ.భా.కాం. అధ్యక్ష పదవిని స్వీకరించారు.

## ముఖ్యమంత్రిగా సంజీవయ్య

ముఖ్యమంత్రి పదవి ఖాళీ కాగానే వారసత్వ తగాదాలు ప్రారంభమైనవి. ముఖ్యమంత్రిని నియమించే సత్తా సంజీవరెడ్డికి ఉంది. అధిష్ఠానవర్గంతో సంప్రదింపులు జరిపారు. తెలంగాణా నాయకుడైన కొండా వెంకట రంగారెడ్డి వైపు అధిష్ఠానవర్గం ఉన్నట్లు వార్తలు బయలుదేరాయి. కేరళ గవర్నరుగా ఉన్న రామకృష్ణారావుతో ఉత్తరప్రత్యుత్తరాలు జరిగాయి. ఢేబర్ సహాయంతో బూర్గులను రంగంలో నిలబెట్టటానికి సత్యనారాయణరాజు ప్రయత్నించగా బూర్గుల ఈ పోటీనించి తప్పుకొని బెజవాడ గోపాలరెడ్డిని ప్రతిపాదించారు. ఇదంతా రహస్యంగానే జరిగింది. బ్రహ్మానందరెడ్డి పేరుకూడా వినిపించింది.

సంజీవరెడ్డి అఖిలభారత రాజకీయరంగంలో ప్రవేశించగానే ముఖ్యమంత్రి పదవికి నేనున్నానన్నారు. అల్లూరి, సంజీవరెడ్డి తొలివిజయాలకు కొంతవరకు కారకుడైన అల్లూరి ఈ పదవి కోరడం సహజమే అయినది. ప్రచండ ప్రచారం, నల్లుల్ని పోగుచేసుకునే విద్య అల్లూరికి అరచేతిలోని ఉసిరిక. తెలంగాణా మిత్రు

లతో కొత్త స్నేహం కలిపినారు. మంత్రికాని అల్లూరికి ఎకాఎకి ముఖ్యమంత్రి పదవి ఏమిటని విసిపించింది. రాజకీయపు కిటుకులన్నీ బాగా ఎగిరిన అల్లూరి తన పక్షాన దామోదరం సంజీవయ్య, ఎస్. బి. పి. పట్టాభిరామారావులను రంగంలో దించారు. ఆయన ప్రచారానికి సంజీవరెడ్డి తాత్కాలికంగా లొంగి పోవలసి వచ్చింది. నలభై ఏళ్ళు నిండీ నిండని సంజీవయ్యను అంతా అంగీకరించారు. తొలి హరిజన ముఖ్యమంత్రిని ఎంచుకొన్న గౌరవం ఆంధ్రప్రదేశ్‌కు లభించింది.

అధికారంలో ఉన్న ఇరవయ్యేడు నెలలు సంజీవయ్య మంత్రివర్గం ఎగుడు దిగుళ్ళతోనే నడిచింది. ఇంతవరకు రాష్ట్ర రాజకీయాలతో సంజీవయ్య వర్గం అంటూ ఏదీలేదు. ముఖ్యమంత్రి కాగానే ఒక వర్గాన్ని కూడగట్టుకొనవలసిన పరిస్థితులు అవసరమై పూర్తిగా అల్లూరిపై ఆధారపడిపోవలసి వచ్చింది. పెద్ద మనుషుల ఒప్పందం మేరకు తెలంగాణా వారికి ఉపముఖ్యమంత్రి పదవి, ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పదవులిచ్చినా అవి మూతా తగాదాలపరకే పరిమితమై ఉండి పోయాయి. ముఖ్యమంత్రి పాక్షిక వైఖరితో చేసే పనులు కె. వి. రెడ్డికి నచ్చ లేదు. కొన్ని కోర్టుకు వెళ్ళి రద్దయినాయి మిగిలిన వాటిని తర్వాత ముఖ్య మంత్రులైన సంజీవరెడ్డి, బ్రహ్మానందరెడ్డి రద్దుబరిచారు. కోరితెచ్చుకున్న ఎ.సి. సుబ్బారెడ్డి బాహాటంగానే యుద్ధానికి దిగారు. మంత్రివర్గంలోనే "యూనిట్ ఫ్రంటు"ని స్థాపించారు. బ్రహ్మానందరెడ్డి, పి.వి.జి. రాజు, కొండా లక్ష్మణ్, ఎ. సి. సుబ్బారెడ్డి, యూనిట్ ఫ్రంటులో చేరిపోయారు. దీనికి అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులైన నీలం సంజీవరెడ్డి మద్దతు ఉంది.

## ఎన్నికల కమిటీ వ్యవహారం

ఆ సమయంలో వచ్చిన ఎన్నికల్లో అభ్యర్థుల్ని నిర్ణయించటానికి ఒక కమిటీని నియమించవలసి వచ్చింది. ఈ కమిటీలో అల్లూరి తన వర్గంవారికే ఎక్కువ స్థానాలిచ్చారని చెప్పి యూనిటి ఫ్రంటు అధిష్ఠాన వర్గానికి ఫిర్యాదు చేసింది అదనుచూసి అల్లూరిపై దెబ్బతీయటానికి సిద్ధంగా ఉన్న సంజీవరెడ్డికిది మంచి అవకాశమిచ్చింది. ఈ కమిటీలో తన పేరు లేనందున ఎ.సి. సుబ్బారెడ్డి పెద్ద అల్లరిచేశారు. ముఖ్యమంత్రి, ఏ. సి., ఒకరొక్కరు పార్లమెంటరీ సంప్ర

దాయానికి విరుద్ధమైన పరిభాషలో దూషించుకున్నారు. ఎ. సి. శక్తివంతుడైన నాయకుడు. స్థాన బలం కలిగిన వ్యక్తి. ఈ తగాదాపడి ఎ. సి. తన మంత్రి పదవిని కోల్పోయారు.

అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షులైన సంజీవరెడ్డి, ఎన్నికల కమిటీ ఎన్నికను నిబంధనావళి ప్రకారం జరగలేదన్న సాకుతో రద్దుచేయించారు. కొత్తగా కమిటీకి ఎన్నికలు జరిపించవలసిందని ఆంధ్రప్రదేశ్ వ్యవహారాలు చూస్తున్న పంత్ ద్వారా ఆదేశాలు పంపారు. పొంచిఉన్న శక్తుల కేంద్రీకరణకిది మంచి సదవకాశాన్ని కలిగించింది. ఎన్నికల కమిటీని యూనిట్ ఫ్రంట్‌వారు హస్తగతం చేసుకొన్నారు.

## నూకల సోదరులు

సంజీవరెడ్డి హయాంలో నూకలవారికి ప్రాధాన్యం లభించలేదు. సంజీవయ్య హయాంలో వీరికి అధిక ప్రాధాన్యం ఇచ్చి జె. వి. నరసింగరావుని పూర్తిగా విస్మరించడంతో తెలంగాణా రాజకీయాలలో సంజీవరెడ్డి చేసిన తప్పులనే అల్లూరి చేస్తున్నారని ఆరోపణ వచ్చింది. నూకల రామచంద్రారెడ్డి మంత్రిఅయినప్పుడు ఆయన సోదరుడు నరోత్తమరెడ్డినే ఎందుకు ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షునిగా చేయాలని ప్రశ్న వినిపించింది. ఇలా ప్రశ్నించిన వారిలో తెలంగాణా నాయకులైన కె. వి రంగారెడ్డి, జె. వి. నరసింగరావు, వి. బి. రాజులున్నారు.

అంతవరకు విడివిడిగా ఉన్న హైదరాబాద్, సికిందరాబాద్ పురపాలక సంఘాలు 1960 ఆగస్టు 3వ తేదీన లీనమై గ్రేటర్ హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ ఏర్పడింది. దీనితో మునిసిపల్ ఎన్నికలు జరుపవలసి వచ్చాయి. దీనికి మంత్రి పి.వి జి. రాజు అధ్యక్షతన ఒక సివిల్ బోర్డు ఏర్పడింది. సివిల్ బోర్డు సూచించిన పేర్లు కొన్ని ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు మార్పు చేయడంతో పి.వి.జి. రాజు, నరోత్తమరెడ్డి వివాదం హెచ్చింది. ఈ విధంగా జె.వి., వి.బి., పి.వి.జి.లు ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు నరోత్తమరెడ్డికి వ్యతిరేకంగా చేతులు కలపడం వలన ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి నరోత్తమరెడ్డి రాజీనామా చేయవలసి వచ్చింది. ఆయన స్థానంలో మంత్రి పదవికి రాజీనామాచేసి ముళ్ళపూడి పళ్ళంరాజు 1961 మార్చి 3వ తేదీన ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులైనారు.

## 1962 ఎన్నికలు - ప్రముఖుల ఓటమి

1962 ఫిబ్రవరి 19వ తేదీన రాష్ట్రంలో మూడవ సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. రాష్ట్ర కాంగ్రెస్‌లోని అంతఃకలహాల వలన ఎన్నికల్లో ఈ పార్టీ 50 సీట్లను పోగొట్టుకుంది. ఉప ముఖ్యమంత్రి కె. వి. రంగారెడ్డి, మంత్రులు కొండా లక్ష్మణ్‌బాపూజీ, మాసుమా బేగం, పిడతల రంగారెడ్డి, మాజీ మంత్రి జె. వి. నరసింగరావు, తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షుడు అచ్యుతరెడ్డి, లెజిస్లేచర్ పార్టీ కార్యదర్శి పి.వి. రాజేశ్వరరావు, ఆంధ్ర మాజీ స్పీకరు రొక్కం లక్ష్మీనరసింహం దొర, బొమ్మకంటి సత్యనారాయణ ప్రభృతులు ఓడిపోయారు.

## తెలుగువారి అదృష్టం

రాష్ట్ర కాంగ్రెస్ సంగతి ఎలా ఉన్నా అఖిలభారత స్థాయిలో ఈ రోజులు తెలుగువారికి బాగా కలిసివచ్చాయి. ఐదుగురు ఆంధ్రులు ఒకేసారి గవర్నరులైనారు. కేరళలో వి. వి. గిరి, ఉత్తరప్రదేశ్‌లో బూర్గుల రామకృష్ణారావు, గుజరాత్‌లో నవాబు మెహిది నవాజ్ జంగ్, అస్సాంలో జనరల్ నాగేష్, పశ్చిమ బెంగాల్‌లో కుమారి పద్మజా నాయుడు. అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులు సంజీవరెడ్డి, అఖిలభారత స్వతంత్రపార్టీ అధ్యక్షులు ఆచార్య రంగా, అఖిల భారత జనసంఘం అధ్యక్షులు అవసరాల రామారావు, లోక్‌సభ స్పీకరు అనంతశయనం అయ్యంగార్ ఆంధ్రులే. అలీయావర్ జంగ్, సాదిత్ అలీఖాన్ రాయబారులైనారు.

## సంజీవరెడ్డి పునరాగమనం

ఎన్నికల తర్వాత సంజీవరెడ్డి రాష్ట్ర రాజకీయాలలో పునః ప్రవేశించి మళ్ళీ ముఖ్యమంత్రి అయినారు. 1962 మార్చి 13న తన మంత్రివర్గాన్ని ఏర్పాటుచేశారు.

సంజీవరెడ్డి ఈసారి గతానికన్నా విశాల ప్రాతిపదికపై మంత్రివర్గాన్ని ఏర్పరచినా, అల్లూరి-సంజీవయ్య వర్గాన్ని చీలదీసే నెపంతో సంజీవయ్యకు మంత్రివర్గంలో స్థానమిచ్చి అల్లూరిని దూరంగా వుంచారు. అల్లూరికి కూడా ఇస్తేకాని రానని సంజీవయ్య మంత్రివర్గంలో చేరలేదు. 1962 జూన్ 4న సంజీవయ్య

అ.భా కాం. అధ్యక్ష పదవి చేపట్టడంతో అల్లూరి సత్యనారాయణరాజు ఒంటరివాడై నట్లయింది. (సంజీవరెడ్డి పన్నిన వ్యూహం ఆయనపట్ల పద్మవ్యూహం అయినది.) అల్లూరి సత్యనారాయణరాజు 1963 సెప్టెంబరు 3న మరణించారు. దానితో ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు మరి కొంతకాలం సంజీవరెడ్డి తిరుగులేని నాయకత్వంలో ఉంచినవి. కాశేశ్వరరావు మరణంతో బి.వి. సుబ్బారెడ్డి స్పీకరు అయినారు. పళ్ళం రాజు మంత్రివర్గంలో చేరటంవలన గొట్టిపాటి బ్రహ్మయ్య ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడైనారు. 1962 సెప్టెంబరు 7వ తేదీన రాష్ట్ర గవర్నరుగా ప్రమాణ స్వీకారం చేసిన జనరల్ ఎస్. ఎం. శ్రీనగే 1964 ఏప్రిల్ 3 వరకు ఆ పదవిలో ఉండిపోయారు. 1962 సెప్టెంబరు 28వ తేదీన పళ్ళం రాజు మరణించారు.

కర్నూలు జిల్లాలో బస్సు రూట్లను జాతీయం చేసినందుకు బస్సు యజమానులు సుప్రీం కోర్టుకు వెళ్ళి కేసు గెలుచుకున్నారు. తప్పు తనమీద వేసుకొని సంజీవరెడ్డి ముఖ్యమంత్రి పదవికి వెంటనే రాజీనామా ఇచ్చారు. ఇది అభినందనీయమైన చర్య. ప్రజాస్వామ్యంలో పరిశుభ్రమైన పరిపాలన సంప్రదాయాన్ని సృష్టించిన వారైనారు సంజీవరెడ్డి. ఆయన స్థానంలో 1964 ఫిబ్రవరి 29న కాసు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి అయినా అసెంబ్లీ నాయకత్వాన్ని సంజీవరెడ్డి నాలుగు నెలలు తమ చేతుల్లో ఉంచుకొన్నారు.

కేంద్రంలో సంజీవరెడ్డి ప్రభృతులతో సిండికేటు బృందం పైకొచ్చింది. లాల్‌బహదూర్ శాస్త్రిని ప్రధానిగా చేసింది ఈ సిండికేటే. శాసనసభా నాయకత్వానికి రాజీనామాచేసి సంజీవరెడ్డి కేంద్ర మంత్రివర్గంలో చేరిపోయారు. రాష్ట్రపతిగా ఎన్నికయినదాకా ఆయన జీవితం పాత పదవులకు రాజీనామాలు, కొత్త పదవుల స్వీకారాలు.

## బ్రహ్మానందీయం

1964 ఫిబ్రవరి 23న ముఖ్యమంత్రి పదవి చేపట్టిన బ్రహ్మానందరెడ్డి పూర్వపు మంత్రివర్గాన్నే ఉంచుకొని నాల్గు నెలల తర్వాత సంజీవరెడ్డి అనుమతి లేకండా తోట రామస్వామి, చెంచు రామానాయుడు, తానేటి వీరరాఘవులను మంత్రివర్గంలో చేర్చుకున్నారు.

బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి అయిన సంవత్సరంలోనే గుంటూరులో అఖిలభారత కాంగ్రెస్ సమావేశాలు జరిగినవి. కొత్త రఘురామయ్యను కాసని తన సారథ్యంలో ఈ మహాసభలను బ్రహ్మాండంగా జరిపించి అఖిల భారత స్థాయిలో తన ప్రతిష్ఠను పెంచుకొన్నారు. ఆయన వ్యతిరేకులు రాష్ట్రంలో ఎ.సి. సుబ్బారెడ్డి సారథ్యంలో కేంద్రంలో సంజీవయ్య, సంజీవరెడ్డి, రఘురామయ్యల మద్దతుతో ఒక ముఠాగా తయారైనారు కాసు, సంజీవరెడ్డికి వ్యతిరేకులైన వాళ్ళందరిని ప్రోగు చేసుకొని తన బలం పెంచుకోవటం ప్రారంభించారు కాసు. మంత్రి పదవి కోల్పోయిన వి.బి. రాజుకు రోడ్డు రవాణా కార్పొరేషన్ అధ్యక్ష పదవి, ఎన్నికల్లో ఓడిపోయిన జె.వి. నరసింగరావుకు విద్యుచ్ఛక్తి బోర్డు అధ్యక్ష పదవి, కందుల ఓబుల్ రెడ్డికి ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్ష పదవి, శీలం సిద్ధారెడ్డికి భూ తనఖా బ్యాంకు అధ్యక్ష పదవులిచ్చారు. గొట్టిపాటి బ్రహ్మయ్యను విధాన పరిషత్ అధ్యక్ష స్థానానికి పంపి, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డిని ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష స్థానంలో కూర్చోపెట్టారు. కాకాని వెంకటరత్నం, వాసిరెడ్డి కృష్ణమూర్తినాయుడు, కె.వి. నారాయణరెడ్డి మున్నగు సంజీవరెడ్డి వ్యతిరేకులంతా బ్రహ్మానందరెడ్డి వర్గంలో చేరిపోయారు.

రాష్ట్ర ఎన్నికల కమిటీలోని 11వ సభ్యుడైన ఆలపాటి వెంకటరామయ్య 1965 జూన్ 6న మరణించారు. ఆయన ఉండగా ఎ సి. ముఠాది పై చేయి. ఎ.సి. ముఠాలో సభ్యులు ఎ. సి. సుబ్బారెడ్డి, నూకల రామచంద్రా రెడ్డి, పి.వి.జి. రాజు, నవాబ్ మీర్ అహమ్మద్ ఆలీఖాన్. శ్రీమతి రుక్మిణమ్మ, ముఖ్యమంత్రి ముఠాలో కాసు బ్రహ్మానందరెడ్డి, చెన్నారెడ్డి, తిమ్మారెడ్డి, తోట రామస్వామి, వి.బి. రాజు. 11వ సభ్యుని భర్తీ కోసం ఎన్నికలు జరపవలసి వచ్చాయి. ఎవరి అభ్యర్థి గెలిస్తే వారికి బలం ఎక్కువ అవుతుంది. అందువలన విపరీతమైన పట్టుదలతో ఇరుపక్షాలవారు ఎన్నికల కురుక్షేత్రంలో దిగారు. ముఖ్యమంత్రి, అభ్యర్థి కాకాని వెంకటరత్నం, ఎ.సి. అభ్యర్థి అంటే సంజీవయ్య, రఘురామయ్య సంజీవరెడ్డి అభ్యర్థి మూర్తిరాజు. చివరకు ముఖ్యమంత్రి గ్రూపు గెలిచింది. కాకాని పదకొండో సభ్యులైనారు.

కాకాని గురించి ఒక సంగతి జ్ఞాపకము చేసుకోవలసి ఉంది. 1951 లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఆచార్యరంగా, సంజీవరెడ్డి మధ్య పోటీ

జరిగినప్పుడు కాకాని వెంకటరత్నం కృష్ణా జిల్లాలోని తన అనుయాయుల వోట్లను సంజీవరెడ్డికి వేయించడంతో సంజీవరెడ్డికి ఆనాడు రాష్ట్ర నాయకత్వం అబ్బింది. ఈ కాకానే ఇప్పుడు సంజీవరెడ్డి అభ్యర్థిని ఓడించి రాష్ట్ర రాజకీయాలనుండి సంజీవరెడ్డిని దూరం చేశారని అనాలి. అందుకే కాకాని వెంకటరత్నాన్ని ఉక్కు కాకాని అంటారు.

## విగ్రహ విధ్వంసన

ఈ తగువులిలా ఉండగా విశాఖకు ఉక్కు కర్మాగారం రాదని పితూరీలు బయలుదేరినాయి. పెట్టుబడి పెట్టదల్చుకున్న ఆంగ్లో అమెరికన్ కన్సార్షియం వారు గోవాకంటే కూడా విశాఖపట్నం అనువైన స్థలమని తమ నివేదికలో పేర్కొన్నారు. అప్పటి ఉక్కుమంత్రి దీన్ని అంగీకరించారు. ప్రాంతీయ దురభిమానాలకు లోనై ఒరిస్సాలో బైలదిల్లా, మద్రాసులో సేలం, మైసూరులో హోస్పేటల్లో ఐదవ ఉక్కు కర్మాగారం స్థాపించాలన్న ప్రచారాలు ప్రారంభమైనవి. ఈ రాజకీయాలలో తమకు ఉక్కు కర్మాగారం దక్కదేమోనని ఆంధ్రులు రాష్ట్ర వ్యాప్తంగా సమ్మెలు, నిరసన వ్రతాలు జరిపారు. అమృతరావు నిరాహారదీక్ష బూనారు. ఉక్కు మంత్రిగా ఉన్న సంజీవరెడ్డి సి. డి కేటు నాయకులైన కామరాజ్, నిజలింగప్పలతో గల స్నేహం కారణంగా రాష్ట్రం తరపున గట్టిగా వాదించలేక పోతున్నారని శాసనసభలో కాంగ్రెస్ సభ్యులు పరోక్షంగాను తెన్నేటి వంటి ప్రతిపక్ష నాయకులు సూటిగాను పేరు పెట్టి సంజీవరెడ్డిపై ఆ బాధ్యత నెట్టారు.

ఉక్కు కర్మాగారం విషయమై అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకులంతా రాజీనామా చేశారు. రాష్ట్రంలో ఇంత రభస జరుగుతున్నా కేంద ప్రభుత్వం మీనమేషాలు లెక్కపెడుతు కూచుంది. అందుకు నిరసనగా ప్రజలు కేంద్ర ప్రభుత్వ ప్రతినిధి అయిన సంజీవరెడ్డి కంచు విగ్రహంపై పగ తీర్చుకొన్నారు. ఇవి విగ్రహ రాజకీయాలు.

## కాంగ్రెస్ కంచుకోట

రాష్ట్రంలో 1967 లో నాల్గవ సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. సంజీవరెడ్డి గ్రూపుకు సంగం, బ్రహ్మానందరెడ్డి గ్రూపునకు సగం స్థానాలిచ్చినారు

కాంగ్రెస్ అధ్యక్షుడు కామరాజ్. అయినా బ్రహ్మానందరెడ్డి అభ్యర్థుల్లో చాలా మంది గెలిచారు. పక్క రాష్ట్రం మద్రాసులో కాంగ్రెస్ కుప్పగా కూలిపోయింది. ఒరిస్సాలో కాంగ్రెస్ ఓడిపోయింది. కేరళ సంగతి సరేసరి. ఈ పరిస్థితులలో ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్‌కు అఖండ విజయం చేకూర్చిన పేరు బ్రహ్మానంద రెడ్డికి లభించింది.

ఎన్నికల అనంతరం మార్చి 3న తిరిగి బ్రహ్మానందరెడ్డి కాంగ్రెస్ శాసన సభా నాయకుడుగా ఏకగ్రీవంగా ఎన్నికైనారు. ఎనమండుగురు కాబినేటు మంత్రులు ఆరుగురు సహాయ మంత్రులతో మంత్రివర్గం నిర్మించారు. డాక్టర్ చెన్నారెడ్డి ఉక్కు మంత్రిగా కేంద్రానికి వెళ్ళడంతో ఒక నెల రోజులలోనే మంత్రివర్గ పునర్నిర్మాణం జరిగింది. కొత్తగా చేరిన మంత్రులు ఏ.సి. సుబ్బా రెడ్డి, కె.వి. నారాయణరెడ్డి, మహ్మద్ ఇబ్రహీం అలీ అన్సారీ, అరిగె రామ స్వామి, వెనిగెళ్ళ సత్యనారాయణ, మొత్తం 18 మంది మంత్రులు. జనసంఖ్యలో చూచినా, విస్తీర్ణంలో చూచినా మంత్రివర్గంలో మూడవ వంతు స్థానం తెలంగాణా ప్రాంతానికి ఉండాలి. ఇంతవరకూ ఇలాగే జరుగుతూ వచ్చింది. కాని ఇప్పుడీ మంత్రివర్గంలో తెలంగాణా సభ్యులకు సగం స్థానాలు లభించాయి. ముఖ్యమంత్రి వర్గంలో తెలంగాణా సభ్యులకుగల సంఖ్యా బలానికిది నిదర్శనమై ఉండవచ్చు. క్యాబినేటులో సహాయ మంత్రుల విచక్షణ తొలగించి ముఖ్యమంత్రి ఇప్పుడు మంత్రులందరిని క్యాబినేటు మంత్రులుగానే మార్చివేశారు. తిమ్మారెడ్డి స్థానంలో కాకాని వెంకటరత్నం ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులైనారు. 1964 ఏప్రిల్ 4 నుండి 1968 ఏప్రిల్ 10 వరకు పట్టంథానుపిళ్ళై, 1968 ఏప్రిల్ 11 నుండి 1976 జనవరి వరకు ఖండూభాయి దేశాయి రాష్ట్ర గవర్నర్లుగా పనిచేశారు. బి.వి. సుబ్బారెడ్డి తిరిగి అసెంబ్లీ స్పీకరుగా ఎన్నికైనాడు. గొట్టిపాటి బ్రహ్మయ్య స్థానంలో పిడతల రంగారెడ్డి కౌన్సిల్ అధ్యక్షులైనారు. లోక్‌సభ ఎన్నికల్లో సంజీవయ్య వోడిపోవడం గ్రూపు రాజకీయాలకు పరాకాష్ఠ.

## నిజాం మరణం

మాజీ హైదరాబాద్ సంస్థానాధీశుడైన నవాబ్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ తన 83వ ఏట, 1967 ఫిబ్రవరి 24న మరణించారు. తన పూర్వీకులు కోల్పో యిన రాజ్యమంతా ఒకచోట చేరే నాటికి తనకు రాజ్యాధికారం పోయింది. తెలుగు దేశ చరిత్రలో ఏడు తరాలు పరిపాలన జరిపిన నిజాం రాజుల శకం ముగిసింది.

మాజీ హైదరాబాద్ రాష్ట్ర తొలి తుది ప్రజా ముఖ్యమంత్రిగా, కేరళ, ఉత్తరప్రదేశ్‌లకు గవర్నరుగా పనిచేసిన బూర్గుల రామకృష్ణారావు 1967 సెప్టెంబరు 15న మరణించారు. విశాలాంధ్ర నిర్మాణానికి ఆయన విజ్ఞతా నిర్ణయమే ముఖ్యకారణమని పత్రికలు వ్రాశాయి. ఈ దురంతరం జరిగిన ఐదు రోజులకే రాష్ట్ర వ్యవహారాల మంత్రి ఎ.సి. సుబ్బారెడ్డి కన్నుమూశారు. ఆయన చెట్టంత మనిషి, మంత్రివర్గపు పేకాటలలో తురుపు ఆసుగా ఉంటూ వచ్చారు.

అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సమావేశాలు 1968 లో హైదరాబాదులో అతివైభవంగా జరిగినవి. వాటి విజయకారకుడైన బ్రహ్మానందరెడ్డికి అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గంలో స్థానం లభించింది. ఆయన అధిష్ఠానవర్గం నాయకుల్లో ఒకరైనారు.

## ప్రత్యేక తెలంగాణా ఉద్యమం

ప్రత్యేక తెలంగాణా ఉద్యమం తొలి రోజుల్లో తెలంగాణా రక్షణలను అమలుపరచడానికై తీసుకోవలసిన చర్యల గురించి చర్చించడానికి ముఖ్యమంత్రి అన్ని రాజకీయ పార్టీలతో 1969 జనవరి 19వ తేదీన ఒక సమావేశం ఏర్పాటు చేశారు. ఉద్యోగాలు, ఉద్యోగుల సీనియారిటీ జాబితాలు, తెలంగాణా మిగులు నిధులు, అభివృద్ధి విద్యా సౌకర్యాలు మొదలైన వాటి గురించి చర్చలు జరిగాయి. అయితే సంతకాలు చేసిన వారిలో కొందరు తెలంగాణా ఉద్యమం ఉధృత స్థాయికి వచ్చేవరకు మెల్లగా జారుకున్నారు.

అఖిలపక్షపు ఒప్పందం ప్రకారం లెక్కలు తీయిస్తే తెలంగాణా ప్రాంతంలో 4,500 మంది గైరు ముల్కీలు పనిచేస్తున్నట్లు తేలింది. వారిని ఆంధ్ర ప్రాంతానికి తరలించటానికి సుప్రీమ్‌కోర్టు అడ్డుకున్నది. ఈ పరిస్థితి ఎదుర్కొనేందుకై ముఖ్యమంత్రి తెలంగాణాకు ప్రత్యేకంగా 2,000 ఉద్యోగాలు కొత్తగా కల్పించారు. వాటికి అభ్యర్థులను ఎన్నుకొనే అధికారం జిల్లా కలెక్టర్లకిచ్చారు.

అఖిలపక్షపు ఒప్పందంలోని రెండవ అంశం తెలంగాణా మిగులు నిధులు. కుమార్ లలిత్ లెక్కలు తీస్తే ఇవి 34.10 కోట్లు వచ్చింది. భార్గవకమిటీ తేల్చిన నిధులు 28.34 కోట్లు.

మంత్రి కొండాలక్ష్మణ్ బాపూజీ తెలంగాణాకు ఆంధ్రప్రదేశ్‌లోని అంతర్భాగంగా స్వతంత్ర ప్రతిపత్తి ఇవ్వాలన్నారు. ఢిల్లీలో ఆయనమాట చెల్లలేదు. ఢిల్లీలోనే ముఖ్యమంత్రికి రాజీనామా అందజేసి డాక్టర్ చెన్నారెడ్డితో మంతనాలు ప్రారంభించారు. డాక్టర్ రావాడ సత్యనారాయణ, సూకల నరోత్తమరెడ్డి ప్రత్యేక తెలంగాణా వాదిగామారి ఆంధ్రుల భాష-తెలంగాణా వారిభాష ఒకటికాదన్నారు. జలగం వెంగళరావుమాత్రం తెలంగాణాకుఇచ్చిన హామీలు సాధించుకునేందుకై ఏసహాయం చేయడానికైనా తాము సిద్ధంగా ఉన్నామని ప్రత్యేక రాష్ట్ర నినాదాన్ని మాత్రం తాము అభినందించమని బహిరంగంగా చెప్పారు.

(తెలంగాణా రాజకీయాలలో డాక్టర్ చెన్నారెడి ఒక శక్తిగానేగాక, సంస్థగా రాణిస్తున్నవారు. ఈనాటి తెలంగాణా కాంగ్రెస్ యువ నాయకుల్లో చాలామంది ఆయన రాజకీయ పాఠశాలలో శిక్షణ పొందినవారే కనుక ఇక్కడి వారికి అయనపట్ల వ్యక్తిగతమైన అభిమానం ఉంది. ఆయనకు ఛత్రంపట్టే వాళ్ళున్నారు. డాక్టర్ చెన్నారెడ్డి కొంతకాలం కొండా వెంకట రంగారెడ్డి, బూర్గుల నాయకత్వంలో పనిచేసినా అంతా స్వయం కృషి స్వప్రభావం, స్వయం సిద్ధం. ఒకరు చెప్పితే వచ్చిందికాదు; ఒకరివద్ద నేర్చిందికాదు. పాతికేళ్ళ వయసుననే పార్లమెంటు సభ్యులైనారు. రెండుసార్లు రాష్ట్ర మంత్రి అయినారు. కేంద్ర మంత్రిగా, గవర్నరుగా అఖిలభారత రాజకీయాలలో రాణించారు. ఆయనది ఒకరికి లొంగి ఉండేతత్వంకాదు.

1969 జనవరిలో తెలంగాణా ఉద్యమం ప్రారంభమైనప్పుడు డాక్టర్ చెన్నారెడ్డి ఎన్నికల కేసు సుప్రీం కోర్టు విచారణలో ఉంది. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాన్ని నడుపుతున్న తెలంగాణా ప్రజా సమితికి ఆయన నాయకత్వం వహించగానే దానికి అఖిల భారత స్థాయి లభించింది. ఈ ఉద్యమరోజుల్లో డాక్టర్ చెన్నారెడ్డిని ఉత్తరాది పత్రికలు "ఫైర్ యీటర్"గా పేర్కొన్నారు.

పార్లమెంటుకు జరిగిన మధ్యంతర ఎన్నికల్లో వెల్లువలా విజృంభించిన తెలంగాణా ప్రజాసమితి పర్వతాలనుకున్నవారిని పెకళించివేసి 10 స్థానాలను గెలుచుకుని లోక్‌సభలో ఎనిమిదవ పెద్ద పార్టీ అయింది. ప్రధాని అష్ట సూత్ర పథకాన్ని అంగీకరించడంతో సమితిని కాంగ్రెస్‌లో విలీనపరిచారు డాక్టరు రెడ్డి.

బ్రహ్మానందరెడ్డిని గద్దె దించటానికి డాక్టరు చెన్నారెడ్డిని ప్రధాని వాడుకున్నారని ప్రచారం జరిగింది.

తెలంగాణా ప్రత్యేక ఉద్యమం డాక్టర్ చెన్నారెడ్డి చేతుల్లో ఉండటం యిష్టం లేని వి. బి. రాజు తన నాయకత్వం ఉండనిపించుకునేందుకు అసెంబ్లీలో తెలంగాణా యునైటెడ్ ఫ్రంట్‌ను సృష్టించి దానికి "సదర్ సాహెబ్" అనిపించుకొన్నారు. అందుకే ప్రజాసమితి నాయకత్వానికి ఫ్రంట్ నాయకత్వానికి మొదటి నుంచీ తూర్పు పడమరలే. ప్రజాసమితిలో డాక్టర్ చెన్నారెడ్డి నాయకత్వం అంగీకరించని వారంతా వి.బి. రాజు పరోక్ష నాయకత్వపు ఛాయలో, నూకల రామచంద్రారెడ్డి కొండా లక్ష్మణ్ న్యాయకత్వం క్రింద తెలంగాణా కాంగ్రెస్ పేర మరోవర్గంలో చేరి పోయారు. రాజకీయ రథాన్ని స్వయంగా నడపటంకంటే నడిపించేవారికి సహాయ పడటమే వి. బి. రాజుకు అలవాటు. ముఖ్యమంత్రికి సచివుడుగా సారథిగా ఉంటున్న రాజు ఆయనతో విభేదించి రాష్ట్ర సమైక్యతకై ముఖ్యమంత్రి రాజీనామా చేయాలని ప్రకటించి మంత్రివర్గం నుంచి బైటపడ్డారు. తాను పెంచి పోషిస్తూ వచ్చిన ఫ్రంటు పక్షాన రాజ్యసభకు ఎన్నికై తదాదిగా కేంద్ర రాజకీయాలలో స్థిరపడిపోయారు.

కేంద్ర ప్రభుత్వానికి వ్యతిరేకంగా నడుపవలసిన యీ ఉద్యమం దుర దృష్టవశాత్తు ఆంధ్రులపై మళ్ళింపబడింది. నిరసన వ్రతాలు సత్యాగ్రహాలతో ఆరంభమైన యీ ఉద్యమం ఆ దశను దాటి బస్సులను పోస్టాఫీసులను తగలబెట్టి ప్రభుత్వ ఆస్తికి నష్టం కలిగించే దశకు వచ్చింది. విద్యాలయాలన్నీ మూసి వేశారు. తలా తోకా లేని అపవాదులను ప్రచారం చేశారు. అవకాశాన్ని తీసుకొని సాంఘిక వ్యతిరేక శక్తులు పీరవిహారం చేశాయి. జిల్లాల్లో పనిచేసే ఆంధ్ర ఉద్యోగులు ముఖ్యంగా ఉపాధ్యాయులు తమ పదవులను వదలిపెట్టి ఆంధ్ర ప్రాంతానికి వెళ్ళిపోయారు. ఈ ఉద్యమంలో గమనించవలసిన విషయమేమిటంటే ఇది ఒక ఆంధ్ర ప్రాంతానికి చెందిన వారికి వ్యతిరేకంగా మాత్రమే జరిగింది. తెలుగు మాతృభాషకాని వారందరూ ఆనాడు రాష్ట్రంలో క్షేమంగా ఉన్నారని రావి నారాయణరెడ్డి తమ ఆత్మకథలో పేర్కొన్నారు. రాయలసీమ నిత్యంకరువుకు ఆటకట్టు. ఈ కరువు నివారణకు గత 12 సంవత్సరాలలో ఇంచుమించుగా ఏమీ చేయ

లేదనే చెప్పవచ్చు. ఆభివృద్ధికోసం అంతా కలసిఉండాలి అని అయన విజ్ఞప్తి చేశారు. సమైక్యత కోసం జాతీయ దృక్పథంతో కృషిచేసినవారు కమ్యూనిస్టులే. నిఖిలాంధ్ర కవి డా॥ సి నారాయణరెడ్డి, "వీర తెలంగాణా నాది, వేరు తెలంగాణా కాదు" అని నినాదమిచ్చారు. "నీ కంటిని నీవు పొడుచుకుంటావా, నీ యింటిని నీవు కాల్చుకుంటావా" అని హెచ్చరించారు మహేంద్రకవి డాక్టర్ దాశరథి.

## పెద్దలు పోయారు

ప్రముఖ కమ్యూనిస్టు నేత, ప్రజాకవి, కార్మిక నాయకుడు, గొప్ప దేశ భక్తుడైన మఖ్దూమ్ మొహియుద్దీన్ 1969 ఆగస్టు 26న మరణించారు. తుది క్షణంవరకు ప్రజల కోసమే తన బ్రతుకు వెచ్చించుతూ వచ్చాడు మఖ్దూం. 1970 ఫిబ్రవరి 10వ తేదీన ముఖ్యమంత్రికి అప్తుడైన గురుమూర్తి కన్నుమూసాడు. జూలై 24న తెలంగాణా పిత కొండా వెంకటరంగా రెడ్డి, నవంబరు 11న ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు దివంగతులైనారు. కాకాలు తీరిన దేశ భక్తులను రాష్ట్రం కోల్పోయింది.

## మంత్రివర్గ విస్తరణ

1969లో బెంగుళూరు సమావేశంలో అఖిలభారత కాంగ్రెస్ కమిటీ రెండుగా చీలిపోయింది రాష్ట్రపతి పదవికి సిండికేటు అభ్యర్థిగా పోటీచేస్తున్న సంజీవ రెడ్డి నామినేషను పత్రాలపై సంతకం చేసిన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి అంతరాత్మ ప్రబోధం అనే సూత్రం లేవనెత్తి సంజీవరెడ్డికి వ్యతిరేకంగా ప్రచారం చేయడం మొదలుపెట్టారు. ఆమె ఢిల్లీకి వెళ్ళిపోయి మురార్జీ ఆర్థికశాఖను తీసుకొని 14 బ్యాంకులను జాతీయం చేశారు. అభిమాన ధనుడైన మురార్జీ ఉప ప్రధాని పదవికి రాజీనామా చేశారు. రాష్ట్రపతి ఎన్నికల సందర్భంలో బ్రహ్మానందరెడ్డి శ్రీమతి ఇందిరాగాంధీ పక్షం వహించి వి.వి. గిరి విజయానికి తోడ్పడ్డాడు.

1969 జూలైలో ముఖ్యమంత్రి కొత్తమంత్రి వర్గాన్ని ప్రకటించారు. శ్రీయుతులు నూకల రామచంద్రారెడ్డి, రామ భూపాలరెడ్డి చేరలేదు. 17 గురు కేబినేట్ మంత్రులు, 11 మంది స్టేటు మంత్రులు వెరసి 28 మంది ఆంధ్ర ప్రదేశ్‌లో ఇంత పెద్ద మంత్రి వర్గం ఏర్పడడం యిదే మొదటిసారి. ప్రణాళికలు

రాష్ట్ర వ్యవహారాలు, భారీ నీటిపారుదల, రవాణా రహదార్లు, విద్య, ఆరోగ్యం తెలంగాణా మంత్రుల ఆధీనంలో వుంచబడినవి.

ఢిల్లీలో పెద్దమనుషుల ఎదుట చేసిన వాగ్దానం ప్రకారం రాష్ట్ర సుస్థిరతకి భంగం వాటిల్లని పరిస్థితు లేర్పడగానే ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి 1971 సెప్టెంబర్ 24న తన పదవికి రాజీనామా చేసారు. తెలంగాణా నాయకుడైన పాములపర్తి వెంకట నరసింహారావుకు ఆస్థానం లభించింది. (పి.వి. నిలకడగల రాజకీయవేత్త. అతివాది కాదు. మితవాది కాదు. అతి భాషి కాదు. మిత భాషి కాదు. అవకాశవాది కూడా కాదు. ఆయన్ని నియమించినప్పుడు ఎటువంటి వ్యతిరేకత కనబడలేదు.)

## ఇండిపెండెంట్ల విజృంభణ

ఐదవ సార్వత్రిక ఎన్నికలు 1972 ఫిబ్రవరిలో జరిగాయి. వెనుకబడిన వర్గాలకు, మైనారిటీ వర్గాలకు, హరిజనులకు, మహిళలకు వెరసి 60 శాతం సీట్లు కేటాయించబడ్డాయి. (కొత్త, పాత కాంగ్రెస్ ప్రముఖుల్లో చాలా మందికి ఈ ఎన్నికల్లో పోటీ చేయటానికి అనుమతి లభించలేదు. కాంగ్రెస్ టికెట్ లభించని వారిలో తిమ్మారెడ్డి, విజయభాస్కర రెడ్డి, నారపరెడ్డి, లక్ష్మీనరసయ్య, జి. సంజీవరెడ్డి మున్నగువారు న్నారు. కాంగ్రెస్ పార్టీ ఈనారి 32 మంది స్త్రీలకు, 17 మంది ముస్లింలకు, 30 మంది కొత్త సభ్యులకు సీట్లు ఇచ్చింది. 287 స్థానాలుగల విధాన సభలో కాంగ్రెస్-218. స్వతంత్ర పార్టీ-2, సిపిఐ-7, సిపిఎం-1, సమ్పూర్ణ తెలంగాణా ప్రజాసమితి-2, ముగ్గురు మజ్లిస్ సభ్యులతో కలసి ఇండిపెండెంట్లు 56 స్థానాలు గెలుచుకున్నారు.

అనుభవజ్ఞులైన ప్రతిపక్ష నాయకులు లేని లోపం ఐదవ శాసనసభలో కనిపించింది. కాంగ్రెస్‌కు శృంగభంగం కలిగించిన స్థానాలుకూడా లేకపోలేదు. నెల్లూరు జిల్లాలో ఏడుగురు కాంగ్రెస్ అభ్యర్థులు తిరుగుబాటుదార్ల చేతుల్లో ఓడిపోయారు. మంథెన నియోజకవర్గంలో ముఖ్యమంత్రితో పోటీచేసిన వేర్పాటువర్గం నాయకుడు ఇ. వి. పద్మనాభన్, ఆరోగ్య మంత్రి అన్సారీతో మహబూబ్ నగర్ నియోజకవర్గంలో పోటీచేసిన సంపూర్ణ ప్రజాసమితి అధ్యక్షుడు శ్రీధర రెడ్డి డిపాజిట్లు గల్లంతు అయినవి.

## పి. వి. నరసింహారావు పాలన

పి. వి. నరసింహారావు నాయకత్వంలో ఈసారి ఏర్పడిన మంత్రివర్గంలో వెనుకబడిన కులాలకు, వెనుకబడిన వర్గాలకు అధిక ప్రాధాన్యం లభించింది. ముగ్గురు హరిజనులు, 5గురు వెనుకబడిన కులాలవారు ఒక గిరిజన సభ్యుడు మంత్రివర్గంలో స్థానం పొందారు.

1972లో రాష్ట్రానికిసంబంధించిన ముగ్గురు ప్రధాన వ్యక్తులు చనిపోయారు. జనవరి 22వ తేదీన స్వామీ రామానందతీర్థ, మే 7న సంజీవయ్య, సెప్టెంబరు 4న జె. వి. నరసింహారావు కన్నుమూసారు.

పి. వి. కీర్తి కిరీటంలో కలికితురాయిగా నిలిచింది, ఆయన హయాంలో రూపొందించిన భూసంస్కరణలు- 18 ఎకరాల మాగాణి భూములపై 34 ఎకరాల మెట్ట భూములపై గరిష్ఠ పరిమితి విధించబడింది. ఈ సందర్భంలో భూమును అన్యాక్రాంతం చేయడాన్ని నిషేధించే శాసనం భూస్వామ్య వర్గాలపై గట్టి దెబ్బతీసింది ఆర్థిక శక్తి వికేంద్రీకరణ జరగనిదే రాజకీయ వికేంద్రీకరణ సాధ్యంకాదు. అయితే పార్టీలోని బలమైన శక్తులను పూర్తిగా త్రోసిరాజనడం ఏ ముఖ్యమంత్రికైనా సాధ్యం కాని పని కనుక ఈ సంస్కరణల నుంచి అవసరమైనంత వరకు తప్పుకోడానికి సవాలక్ష క్లాజులు రూపొందించక తప్పలేదు. ఇక పేద వర్గాలకు భూములెలా లభిస్తాయి? ఈ సంస్కరణ వలన లాభం మాత్రం ఒకటి జరగింది. కొందరు భూస్వాములు తమకు గల అదనపు భూములను రైతులకు సులభమైన ధరలకు అమ్మేసుకొన్నారు.

## ప్రత్యేక ఆంధ్రోధ్యమం

ఆంధ్రప్రదేశ్ హైకోర్టుకోని ముగ్గురు న్యాయమూర్తులు 1970 డిసెంబరు 12వ తేదీన ముల్కీరూల్సు చెల్లుతాయని ఇచ్చిన తీర్పును 1972 ఫిబ్రవరి 4వ తేదీన 5గురు న్యాయమూర్తులు రద్దుపరిచారు. దానిపై పి.వి. ప్రభుత్వం సుప్రీం కోర్టుకు అపీలు చేసుకుంది. హైకోర్టు నిర్ణయాన్ని మామూలుగా సుప్రీం కోర్టు బలపరచవచ్చని తద్వారా యీ సమస్య అణగిపోగలదని భావించిన రాష్ట్ర ప్రభుత్వం అభిప్రాయానికి వ్యతిరేకంగా ముల్కీ రూల్సు చెల్లుతాయని 1972 అక్టోబరు 3వ తేదీన సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు రాష్ట్ర ప్రభుత్వానికి అనేక సమస్యలను తెచ్చిపెట్టింది. ఈ తీర్పు తెలంగాణావారి ఉద్యోగపు హక్కుపై తుది

తీర్పు అన్నారు, ముఖ్యమంత్రి పి. వి. నరసింహారావు. ఈ అవ్యక్త ప్రకటన ఆంధ్రులను కోపోద్రిక్తులను చేసింది. ఇది ముఖ్యంగా ఆంధ్రుల చదువులకు ఉద్యోగాలకు సంబంధించిన సమస్య. ఇది అమలు పరిస్తే ఇంతవరకు ఆంధ్ర విద్యార్థులకు జంటనగరాలలో 100కి 3 వంతులు లభించే సీట్లు ఇక లభించవు. తెలంగాణా ప్రాంతంలో ఆంధ్రులు ఉద్యోగాలకు అనర్హులౌతారు. కాగా ఆంధ్రేతరులైన మాజీ నిజాం రాష్ట్ర వాసులకు ఈ ఉద్యోగాలు రావచ్చును. ఈ వైపరీత్యం ఆంధ్ర విద్యార్థులకు మానసికంగా కష్టకారణమైంది. మంత్రులు ఢిల్లీ వెళ్ళారు. ఆంధ్ర ప్రాంతంలో ఆందోళన పుంజుకొన్నది.

ఈ సందర్భంలో పి. వి. నరసింహారావు, ఆంధ్ర మంత్రులతోను, తెలంగాణా మంత్రులతోను వేరువేరుగా సంప్రదింపులు జరపడం మొదలుపెట్టారు.

ఆంధ్ర ప్రాంతం అట్టుడికినట్టు ఉడికిపోయింది. తెలంగాణా మంత్రులు ఆంధ్ర మంత్రులు ఇచ్చిన వాగ్దానాలను పురస్కరించుకొని ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ పంచ సూత్ర పథకాన్ని ప్రకటించారు అందుకు ప్రజలు ఆమోదించలేదు. ప్రత్యేక రాష్ట్ర డిమాండు ఎక్కువైంది.

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రానికి అనుకూలంగాను, ప్రధాని పంచసూత్ర పథకానికి వ్యతిరేకంగాను ప్రజాభిప్రాయం బలపడటాన్ని చూసి 9 మంది ఆంధ్ర మంత్రులు- బి. వి. సుబ్బారెడ్డి, ఖత్తిన సుబ్బారావు, వి. కృష్ణమూర్తి నాయుడు, కాకాని వెంకటరత్నం, సాగి సూర్యనారాయణరాజు, పి. బసిరెడ్డి, చల్లా సుబ్బారాయుడు, డి. మునుస్వామి, మూర్తిరాజు- కాంగ్రెస్ అధ్యక్షునకు తమ రాజీనామా లేఖ లందజేశారు. కాల్పులను కళ్ళారాచూసి విపరీతమైన మనస్తాపానికి లోనై 1972 డిసెంబరు 24వ తేదీన కాకాని గుండెబ్రద్దలై చనిపోయారు.

1973 జనవరి 11వ తేదీన పి. వి. నరసింహారావు 8 మంది కొత్త మంత్రులను నియమించారు. అదే రోజున రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గాన్ని రద్దు చేస్తూ ఉన్నతాధికార సంఘాన్ని వేసారు. ఈ ఉన్నతాధికార సంఘం రాష్ట్రంలో అధ్యక్ష పరిపాలన సూచించింది. ప్రధాని ఆదేశంపై ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు 1973 జనవరి 17న తమ పదవికి రాజీనామా ఇచ్చారు. రాష్ట్రంలో 1973 జనవరి 18వ తేదీన ప్రవేశపెట్టబడిన రాష్ట్రపతి పరిపాలనలో హెచ్.సి. సరీన్, వి. కె. రావు గవర్నరు సలహాదారులుగా నియమితులయ్యారు.

## తెలుగు ప్రజల మగ్నా కార్టా

ఆంధ్రప్రదేశ్ సమగ్రతనూ, సమైక్యాన్ని కొనసాగిస్తూనూ మరింత ప్రతిష్ఠం చేస్తూనూ, అదే సమయంలో అన్ని ప్రాంతాల ప్రజల సత్వర అవసరాలను తీర్చ డానికోసం త్వరితంగా నిర్మాణాత్మక చర్యలు తీసుకోవడంలో గల ప్రాముఖ్యాన్ని దృష్టిలో పెట్టుకొని ఆంధ్ర-తెలంగాణా నాయకులు ఒక షట్సూత్ర పథకం రూపొందించుకొన్నారు. ప్రజల సహకారంతో అన్ని ప్రాంతాలలో సమాభి వృద్ధిని సాధించడానికి అవకాశాలు కల్పించడం ఈ సూత్రంలోని ముఖ్యాంశం. షట్సూత్రపథకం ఆంధ్రప్రదేశ్ సమైక్యానికి మాగ్నా కార్టాగా నిలచిందని ముఖ్య మంత్రి అయిన తర్వాత వెంగళరావు అన్నారు. ఆంధ్ర కార్యాచరణ సమితి 1973 నవంబరులో పి. వి. నాయకుడుగా ఉండరాదని నిర్ణయించింది. తదను గుణంగా పి. వి. నాయకత్వం నుండి విరమించుకొని కొత్త నాయకుని ఎన్నికకు మార్గం సుగమం చేసారు. రాష్ట్ర సమగ్రత పరిరక్షణకు తమ పదవిని త్యాగం చేసిన ముఖ్యమంత్రులలో పి. వి. నరసింహారావు రెండవవారు

"వీరగంధము దెచ్చినారము
వీరుడెవ్వడో దెల్పుడీ !
పూసిపోదము మెడనువైతుము
పూలదండలు భక్తితో !!"

ఆ వీరుడు జలగం వెంగళరావు అయినారు. ఆ పూలదండ వెంగళరావు మెడలో పడింది. ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలన 320 రోజుల తర్వాత 1973 డిసెంబరు 10వ తేదీన సోమవారం సాయంత్రం 5 గంటలకు అంత మయింది. తిరిగి ప్రజా ప్రభుత్వం నెలకొన్నది.

## వెంగళరావు నాయకత్వం

హైదరాబాద్ సంస్థాన రాజకీయాలలో 1940 లోనే ప్రవేశించిన జలగం వెంగళరావు, స్వామీజీ అనుచర వర్గంలోనివారు. స్వయం కృషితో పైకి వచ్చిన వ్యక్తి ఖమ్మం జిల్లా పరిషత్తు అధ్యక్షులుగా, రాష్ట్ర పంచాయితీ రాజ్ చేంబరు అధ్యక్షులుగా పనిచేశారు. 1969 లో బ్రహ్మానందరెడ్డి మంత్రి వర్గంలో హోం మంత్రిగా పదవి స్వీకరించిన కొద్ది రోజులలోనే ఆయన సమర్థ

డైన హోం మంత్రిగా పేరు పొందారు. ముఖ్యంగా నక్సలైట్ల వేర్పాటు వాదుల పేర జరిగిన దౌర్జన్య చర్యలను అణచివేయడంలో 'ఉక్కుపహస్తం'గా వ్యవహరించి హోం మంత్రిగా తన స్థానాన్ని సుస్థిరం చేసుకొన్నారు. 1972 సాధారణ ఎన్నికల తర్వాత పి.వి. నరసింహారావు మంత్రివర్గంలో పరిశ్రమల మంత్రిగా చేరారు. అరాచక వాదం గిట్టని వెంగళరావు త్వరితంగా నిర్ణయాలు చేయడంలో దిట్ట. ఆయనకు రాష్ట్రాభివృద్ధి, రాష్ట్ర రాజకీయాలను మించి వేరే వ్యాపకాలు లేవు.

## ముఠాలను కట్టలేదు; ప్రోత్సహించలేదు

జలగం వెంగళరావు ముఠాలకు అతీతుడు. ముఠాలను కట్టలేదు, ముఠాలను ప్రోత్సహించలేదు. వివిధ దశలలో ఆయన నిర్మించిన మంత్రివర్గాలే అందుకు తార్కాణాలు.

## ప్రపంచ తెలుగు మహాసభలు

తెలుగు ప్రజల భావ సమైక్యత మెరుగుపరచడానికి, అంతర్జాతీయ సంబంధాలను అభివృద్ధి పరచడానికి, ముఖ్యమంత్రి జలగం వెంగళరావు సారథ్యంలో విద్యామంత్రి మండలి వెంకటకృష్ణారావు కార్యనిర్వాహక అధ్యక్షతన హైదరాబాద్‌లో 1975 ఏప్రిల్ 12వ తేదీ నుంచి 18వ తేదీ వరకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పక్షాన ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించబడ్డాయి. చారిత్రాత్మకమైన ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలో తీసుకొన్న నిర్ణయం ప్రకారం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒక అంతర్జాతీయ తెలుగు సంస్థను నెలకొల్పింది. అంతర్జాతీయ స్థాయిలోను, దేశీయావసరాలను ప్రత్యేకంగా దృష్టిలో పెట్టుకొని పరిశోధన, అధ్యయనాలూ, నిర్వహించడం ఈ సంస్థ ప్రధాన కర్తవ్యం.

## నిర్మాణ కార్యక్రమాలు

పి. వి. నరసింహారావు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ప్రవేశ పెట్టిన భూ సంస్కరణల చట్టాన్ని వెంగళరావు ప్రభుత్వం నిర్దుష్టంగా అమలు పరిచింది. బలహీన వర్గాల సంక్షేమంకోసం ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డు కులాల ఆర్థిక కార్పొరేషన్, ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన కులాల ఆర్థిక కార్పొరేషన్, ఆంధ్రప్రదేశ్ గిరిజన సహకార కార్పొరేషన్ మున్నగు సంస్థలు స్థాపించబడ్డాయి.

## వింధ్య దాటని జనతా

1977 లో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో ఆంధ్రప్రదేశ్‌కు అమిత ప్రాధాన్యం ఉన్నది. కాంగ్రెస్‌కు పెట్టని కోటగా కేంద్రం ఆంధ్రప్రదేశ్‌ను పరిగణించింది. దాదాపు 42 లోక్‌సభ స్థానాలను సంపాదించుకోవాలనే దీక్షతో ముఖ్యమంత్రి వెంగళరావు అన్ని వర్గాలకు ఈ ఎన్నికల్లో ప్రాతినిధ్యమిచ్చారు. ఒక్క నంద్యాల మినహా అన్ని నియోజక వర్గాలలో కాంగ్రెస్ విజయం సాధించి రికార్డు సృష్టించుకుంది. నంద్యాలలో జనతా పార్టీ విజయం సంజీవరెడ్డి వ్యక్తిగత విజయంగానే భావించాలి. ఎందుకంటే ఆయనతో పోటీ చేసిన కాంగ్రెస్ అభ్యర్థి పెండేకంటి వెంకట సుబ్బయ్య 1978 ఫిబ్రవరి ఈ నియోజక వర్గంలో జరిగిన ఉప ఎన్నికల్లో ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థిగా గెలుపు సాధించారు. 29 స్థానాలకు పోటీ చేసిన జనతా పార్టీ ఒకే స్థానాన్ని గెలుచుకోగా ఆరు స్థానాలకు పోటీ చేసిన ప్రజాస్వామ్య కాంగ్రెస్ ఒక్క సీటూ గెల్చుకోలేకపోయింది. ఈసారి ఎన్నికల్లో పోటీ చేసిన ఇండిపెండెంటు అభ్యర్థులందరికి డిపాజిట్లు పోవడం విశేషం.

వెంగళరావు పరిపాలనా కాలంలో నలుగురు గవర్నర్లు మారారు. 1975 జనవరి వరకు ఖండూభాయి దేశాయ్, 1976 జనవరి 1 నుండి జూన్ 15 వరకు మోహన్‌లాల్ సుఖాడియా, 1976 జూన్ 16 నుంచి మార్చి 77 వరకు ఆర్.డి. భండారే, 1977 మే 5 నుంచి శ్రీమతి శారదా ముఖర్జీ ఈ పదవిలో ఉన్నారు.

## పెరసి 35 మంది మంత్రులు

కాసు బ్రహ్మానందరెడ్డి 1977 మే 6వ తేదీన అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నిక కావటంతో ముఖ్యమంత్రి పదవికి రాజీనామా ఇస్తానన్న వెంగళరావు తర్వాత బ్రహ్మానందరెడ్డితో రాజీపడ్డారు. ఇందిరాగాంధీ బ్రహ్మానందరెడ్డి విభేదాల సమయంలో వెంగళరావు బ్రహ్మానందరెడ్డి పక్షం వహించడంతో రాష్ట్ర కాంగ్రెసులోను, మంత్రివర్గంలోకు ముసలం పుట్టింది. తమ స్థానాలను పదిలపరచుకోడానికై బ్రహ్మానందరెడ్డి వెంగళరావు తిరుమ్మక్కై ప్రదేశ్ కాంగ్రెస్ పునర్ వ్యవస్థీకరణ చర్యగా రహమతుల్లాను ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులుగా నియమించి, తదనుకూలంగా మంత్రివర్గాన్ని విస్తరించుకొన్నారని ప్రత్యర్థుల ఆరోపణ. 12 మంత్రి మంత్రులతో ప్రారంభమైన వెంగళరావు మంత్రివర్గం 1973 సెప్టెంబర్ 4న నాల్గవసారి విస్తరణతో 35 మందికి పెరిగింది.

దాదాపు పదేళ్ళనుంచి నానుతున్న హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌కు వెంగళరావు మంత్రివర్గంకూడా ఎన్నికలను జరిపించలేకపోయింది పంచాయతీరాజ్ సమితుల అధ్యక్షులను జిల్లా పరిషత్ చైర్మన్ పదవులను రద్దు పరచిన ముఖ్యమంత్రి వెంటనే వాటి ఎన్నికలు జరిపించితే ప్రజాస్వామ్యంపై గల ఆయన విశ్వాసం పునరుక్తమై సాధారణ ఎన్నికల్లో తమ పార్టీ గెలుపునకది ఉపయోగపడేది. ఎన్నికైన వ్యక్తులకంటే అధికారులచేత పని చేయించుకోవం సులభమనే చౌకబారు విధానానికి ప్రజా ప్రభుత్వాలు లొంగిపోవటం దురదృష్ట కరం. రాష్ట్రంలో సంజయ్‌గాంధీ నాల్గుసార్లు పర్యటనలు జరుపగా రాష్ట్ర ప్రభుత్వం ఆయనకు ఘనంగా స్వాగతం ఇచ్చింది. కేంద్ర ప్రభుత్వ ఆదేశం ప్రకారం తామీపని చేసినట్లు విమద్‌లాల్ కమీషన్ ఎదుట ముఖ్యమంత్రి సాక్ష్య మిచ్చారు. నక్సలైట్లు మున్నగు తీవ్రవాదులపై జరిగిన అత్యాచారాల గురించి విచారిందడానికి కేంద్ర ప్రభుత్వం సూచనపై ముఖ్యమంత్రి భార్గవ కమీషన్‌ను నియమించి ప్రజా స్వామ్య విధానంపై గల తమ ప్రగాఢ విశ్వాసాన్ని ప్రకటించు కొన్నారు. ఇక్కడ ఒక మాట స్పష్టంగా చెప్పడం చాలా అవసరం. ఎమర్జన్సీ కాలంలో ముఖ్యమంత్రి నిర్బంధ కుటుంబ శస్త్రచికిత్సలను హింసాత్మకంగా జరి పించలేదు. తన రాజకీయ ప్రత్యర్థులైనవారినందరిని కారాగారాలకు పంపలేదు. శ్రీమతి ఇందిరాగాంధీ నిర్దేశించిన 20 అంశాల ఆర్థిక కార్యక్రమాన్ని రాష్ట్రంలో పగడ్బందిగా జరిపించి రాబోయే అసెంబ్లీ ఎన్నికల్లో ఇందిరా కాంగ్రెసు విజయా నికి పరోక్షంగా ముఖ్యమంత్రి తోడ్పడ్డాడని ఎన్నికల ఫలితాల ప్రకటనానంతరం రాజకీయ వ్యాఖ్యాతలు పేర్కొన్నారు.

## కాంగ్రెసు చీలిక

ఇరవై ఏడు సంవత్సరాల కాలంలో కాంగ్రెసు అత్యున్నత పదవికి 1977 మే 3వ తేదీన పోటీ జరిగింది. కాసు బ్రహ్మానందరెడ్డికి 317 వోట్లు, ఆయనతో పోటీ చేసిన సిద్ధార్థ శంకరరాయ్‌కు 160 వోట్లు వచ్చాయి. కాసు శ్రీమతి ఇందిరాగాంధి రబ్బరు స్టాంపుగా ఉండటానికి అంగీకరించలేదు. రాజకీయ అరణ్యవాసం భరించలేని ఇందిరాగాంధీ కాంగ్రెసును రెండవసారి చీల్చడానికి పూనుకున్నారు. గడచిన ఎనమిదేళ్ళలో ఎనిమిది మంది కాంగ్రెసు అధ్యక్షులు మారారు. శ్రీమతి గాంధీ తనకు నచ్చని వారిని చెప్పుచేతుల్లో ఉండని వారిని

అధికారంలో ఉండనీయరని తాము కాంగ్రెసు అధ్యక్షులైన మూడు నెలలెన్లో ఉద్వాసన చెప్పించడానికి ఆమె ఉద్యమం ప్రారంభించారని కాసు అన్నారు.

## చెన్నారెడ్డి ప్రవేశం

1977 అక్టోబరు 1వ తేదీన ఉత్తర ప్రదేశ్ గవర్నరు పదవికి రాజీనామా చేసిన డాక్టర్ మర్రి చెన్నారెడ్డి రాష్ట్ర రాజకీయాలలో ఝుం ఝూం మారుతంలా ప్రవేశించలేదు. ఉన్న పార్టీని సమర్థించడంలోను కొత్త పార్టీని పోషించడంలోను సమర్థుడైన డాక్టర్ చెన్నారెడ్డి ఒక కొత్త పార్టీ పెట్టేముందు ప్రజలు తమ నెంత వరకు అనుసరిస్తారో తెలుసుకుంటారు. ఆయన పట్టినపక్షం నెగ్గడం ఆయన దీక్ష. ఆయన ఒక సిద్ధాంతానికి పూనుకుంటే దాని అంతు చూస్తారని రాష్ట్రంలో ప్రతిష్ఠ ఉన్నది. ఉభయ ప్రాంతాల మిత్రులతో సంభాషణలు ప్రారంభించారు. గతంలో ఆంధ్ర కేసరి ప్రకాశం, ప్రొఫెసర్ రంగా ప్రాంతీయ పార్టీలు పెట్టి విఫలమైన సంగతి కందుల ఓబులరెడ్డి ప్రభృతులు గుర్తుకు తేగా డాక్టర్ చెన్నారెడ్డి పునరాలోచనలో పడి, శ్రీమతి గాంధీ కొత్త పార్టీ గనుక పెడతే అందుకు తమద్వారా ఎంత మద్దతు లభిస్తుందో బేరీజు వేసుకోవడం మొదలుపెట్టారు. నవంబరు 13వ తేదీన కర్ణాటక ముఖ్యమంత్రి దేవరాజ్ అర్స్ హైదరాబాద్‌కు వచ్చి డాక్టర్ చెన్నారెడ్డితో మంతనాలు జరిపారు. ఇందిరాగాంధీ కొత్త పార్టీకి దేవరాజ్ అర్స్ చెన్నారెడ్డి నవ్యరథ సారథులుగా నిలవడానికి నిర్ణయం తీసుకున్నారు.

## తుఫాన్ రాజకీయాలు

గత వంద సంవత్సరాలలో కనీవిని యెరుగని ఘోర ఉపద్రవం 1977 నవంబరు 20వ తేదీ శనివారంనాడు ఆంధ్రప్రదేశ్ కోస్తా జిల్లాలకు సంభవించింది. దీన్ని ఒక మహత్తర అవకాశంగా శ్రీమతి ఇందిరాగాంధీ మొదలుకొని అందరు రాజకీయ నాయకులు భావించారు. పునరావాస చర్యల గూర్చి ముఖ్యమంత్రి సీనియరు మంత్రులతోనైనా సంప్రదించడంలేదని, మంత్రివర్గ సమిష్టి బాధ్యతను ముఖ్యమంత్రి గౌరవించడంలేదని మంత్రులు పి. రంగారెడ్డి, జె. చొక్కారావు, టి. అంజయ్య, ఆనం వెంకటరెడ్డి, పి. ధర్మారెడ్డి, తెలంగాణా అభివృద్ధి ప్రణాళికా సంఘం అధ్యక్షుడు సి. జగన్నాథరావు, హైదరాబాద్ నగర [illegible] ద్ధి సంఘం అధ్యక్షురాలు శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి డిసెంబరు 2న ర[illegible] చేశారు.

ముఖ్యమంత్రితో సంప్రదించకుండా మంత్రులు రాజమల్లు టి. అంజయ్య ఢిల్లీకి పోయి శ్రీమతి ఇందిరాగాంధీని తుఫాను బాధిత ప్రాంతాలను పర్యటించ వలసినదిగా ఆహ్వానించారు. దానిపై ముఖ్యమంత్రి రాజమల్లును రాజీనామా కోరారు. మంత్రులు లుకలాపు లక్షణదాస్, పురుషోత్తమరెడ్డి డిసెంబరు 30వ తేదీన స్పీకరు రేబాల దశరథరామిరెడ్డి 1978 జనవరి 14న రాజీనామా చేసి జనతా పార్టీలో చేరిపోయారు. మాజీ మంత్రులు చొక్కారావు, రంగారెడ్డి కూడా జనతాలో చేరారు. ఒక వంక ప్రకృతి తెచ్చిన బీభత్సం, మరొక వంక రాజకీయ ప్రళయం ముఖ్యమంత్రిని గొప్ప ఇరకాటంలో పెట్టింది. ముఖ్యమంత్రి వీటిని లెక్కపెట్టక మేరు నగరధీరుడుగా నిలిచి పునరావాస కార్యక్రమాలను నడిపించారు.

## ఇందిరా కాంగ్రెస్ ఆవిర్భావం

1978 జనవరి 2వ తేదీన శ్రీమతి ఇందిరాగాంధీ అఖిలభారత జాతీయ కాంగ్రెసు నుండి విడిపోయి తన అధ్యక్షతలో కాంగ్రెస్ (ఐ) ని స్థాపించినట్లు ప్రకటించారు. కాంగ్రెస్‌లో కలతలు పనికిరావని శ్రీమతి గాంధీ, బ్రహ్మానంద రెడ్డి కలసి పనిచేయాలని తాము కోరుతున్నామని, కాంగ్రెస్‌లో కలతలువస్తే జనతా లాభిస్తుందని ముఖ్యమంత్రి జలగం వెంగళరావు బాధపడ్డారు. రాజారాం వర్గంవారు ముఖ్యమంత్రిని శ్రీమతి గాంధీ పట్ల విధేయత ప్రకటించాలని ఒత్తిడి తెచ్చినా పి.వి., డాక్టర్ చెన్నారెడ్డి అటువైపు ఉన్న దృష్ట్యా తనకు అక్కడ హార్దిక స్వాగతం లభించదని వెంగళరావుకు తెలుసును. మంత్రులు రాజారాం, మానిక్‌రావు, నరసప్ప, శేషావతారం రాజీనామా చేసి కాంగ్రెస్ (ఐ) లో చేరి పోయారు. జనవరి 18వ తేదీన హైదరాబాద్‌లో ఇందిరా కాంగ్రెస్ సదస్సు జరిగింది. డాక్టర్ చెన్నారెడ్డి ఇ. కాం. రాష్ట్ర శాఖ అధ్యక్షులుగా నియమించ బడ్డారు. పార్టీ కార్యకర్తలకు హితవు చెబుతూ శ్రీమతి గాంధీ "నా సందేశం ప్రజలకు వినిపించండి మనదే విజయం అన్నారు."

## 1978 ఎన్నికలు

1978 ఫిబ్రవరిలో అస్సాం, మహారాష్ట్ర, కర్నాటక, మేఘాలయ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలకు, కేంద్ర పాలిత ప్రాంతమైన అరుణాచల ప్రదేశ్‌కు

మాత్రమే అసెంబ్లీ ఎన్నికలు జరిగాయి. ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలోని 294 స్థానాలకు మొత్తం 1538 మంది అభ్యర్థులు పోటీ చేశారు.

ఏ పార్టీకి రాష్ట్రంలో మెజారిటీ రాదనుకున్న రాజకీయ అతిరథ మహారథ జ్యోతిష్కులందరికి ఈ ఎన్నికల ఫలితాలు సంభ్రమాశ్చర్యాలు కలిగించాయి. ఇందిరా కాంగ్రెస్ నిర్మాణ రీత్యా కొత్తదే అయినా ప్రజలు ఆ పార్టీని శ్రీమతి ఇందిరాగాంధీ పేరున గెలిపించారు. ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థులలో చాలా మంది కొత్త వారే అయినా ఇందిరకు వోటు చేసినట్లుగా భావించి వారిని గెలిపించారు. ఇందిర గాలికి మహా వృక్షమనుకున్న అఖిలభారత జాతీయ కాంగ్రెసు సునాయాసంగా నేల కొరిగింది. ఉరకలు పొంగే ప్రజాశక్తి ఊహించనంతగా ఇందిర పక్షాన విజృంభించటంతో బలవత్తరమైనదనుకొన్న జనతాపార్టీ ఆ దాడికి తట్టుకోలేకపోయింది. ఎన్నికలలో తన పార్టీకి జరిగిన ఘోర పరాజయం తనదిగా తీసుకొని కాంగ్రెసు అధ్యక్షుడు బ్రహ్మానందరెడ్డి తమ పదవికి రాజీనామా చేశారు.

వెంగళరావు మంత్రి వర్గంలోని ఆసిఫ్‌పాషా, ఇబ్రహీం అలీ అన్సారీ, పి. నరసారెడ్డి, యర్రా నారాయణస్వామి, బత్తిన సుబ్బారావు, పి. మహేంద్రనాథ్, వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడు, పల్లా వెంకటరావు, శ్రీమతి లక్ష్మీదేవి ఓడిపోయారు. ముఖ్యమంత్రి వెంగళరావు. మంత్రులు భాట్టం శ్రీరామమూర్తి, ఎం.వి. కృష్ణారావు, కె.వి. కేశవులు, డి. మునుస్వామి, కె. అప్పుడు దొర మాత్రమే గెలిచారు. జనతా పార్టీ ప్రముఖుల్లో జె. చొక్కారావు, ఆనం వెంకటరెడ్డి (మాజీ మంత్రులు), కోట పున్నయ్య, ఎ.ఎన్. చౌదరి (రాజ్యసభ సభ్యులు) రేబాల దశరథరామరెడ్డి (మాజీ స్పీకరు). లెజిస్లేచరు పార్టీ ఉపనాయకుడు ఎ. శ్రీరాములు ఓడిపోయారు. ఇందిరా కాంగ్రెసు ప్రముఖ నాయకులైన టి. అంజయ్య, రాజమల్లు, ధర్మారెడ్డి (మాజీ మంత్రులు), సి. జగన్నాధరావు, శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి ఓడిపోయారు. కమ్యూనిస్టు నాయకులు వేములపల్లి శ్రీకృష్ణ, వంకా సత్యనారాయణ, రిపబ్లికన్ పార్టీ ఏకైక సభ్యురాలు శ్రీమతి ఈశ్వరీబాయి పరాజయం చెందారు.

## చెన్నారెడ్డి మంత్రివర్గం

రాష్ట్రంలో ఇందిరా కాంగ్రెసుకు పూర్తి మెజారిటీ లభించడంవలన ఆ

పార్టీ రాష్ట్ర శాఖ అధ్యక్షులైన డాక్టర్ మర్రి చెన్నారెడ్డి ఏకగ్రీవంగా ముఖ్య మంత్రిగా ఎన్నికైనారు.

చెన్నారెడ్డి మంత్రివర్గంలో 11 మంది వెనుకబడిన తరగతులకు, ఐదుగురు షెడ్యూల్డు కులాలకు, ఇద్దరు షెడ్యూల్డు తెగలకు చెందినవారు. మంత్రులలో ముగ్గురు ముస్లింలు, ఒక మహిళ కూడ ఉన్నారు. ఈ మంత్రివర్గంలో 19 మంది ప్రప్రథమంగా మంత్రులైనారు. ఆంధ్ర తెలంగాణా ప్రాంతం వారికి 3.1 నిష్పత్తిలో అంటే ఆంధ్ర ప్రాంతం వారికి ఐదింట మూడు వంతులు, తెలంగాణా ప్రాంతానికి రెండు వంతుల చొప్పున మంత్రి పదవులిచ్చారు. దివి కొండయ్య చౌదరి స్పీకరుగా ఎన్నికైనారు.

# విధాన మండలి

—ఎం. రాంచందర్

భారతదేశం సమాఖ్యరాజ్యం. కాని ఇతర సమాఖ్య రాజ్యాలకు భిన్న మయింది. మన రాజ్యాంగం దేశాన్ని 'రాష్ట్రాల సమ్మేళనం'గా పేర్కొంది. నేడు మన దేశంలో 22 రాష్ట్రాలు ఉన్నవి. ప్రతి రాష్ట్రానికి ఒక విధానసభ **(Legislative Assembly)** తప్పని సరిగా ఉంటుంది. కొన్ని రాష్ట్రాలలో విధాన సభతోపాటు విధాన పరిషత్తు **(Legislative Council)** కూడ ఉన్నది. అటువంటి రాష్ట్రాలు ఏడు కలవు. అవి: (1) ఆంధ్రప్రదేశ్ (2) బీహార్ (3) జమ్మూ-కాశ్మీర్ (4) తమిళనాడు (5) మహారాష్ట్ర (6) కర్ణాటక (7) ఉత్తర ప్రదేశ్. రెండు సభలున్న రాష్ట్రాలలో విధానసభను దిగువ సభని, విధాన పరి షత్తును ఎగువ సభని అంటారు. ఆంధ్రప్రదేశ్‌లో విధానసభ, విధాన పరిషత్తు రెండూ ఉన్నాయి.

విధానసభ సంఖ్య ఎప్పుడూ ఒకేరకంగా ఉండదు. జనాభాను బట్టి మారు తుంది. ప్రతి పది సంవత్సరాల కొకసారి జరిగే జనాభా లెక్కల సేకరణ తరు వాత విధానసభ స్థానాల సంఖ్య నిర్ణయించబడుతుంది. 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు విధానసభ ఒక్కటే ఉండేది. 1958 జూలై ఒకటిన విధాన పరిషత్తు ఏర్పాటయినది. ఆంధ్రప్రదేశ్ మొదటి విధానసభ స్థానాల సంఖ్య 293 రెండవ విధాన సభలో స్థానాలు 301 మూడవ విధానసభ స్థానాలు 300 నాలుగవ మరియు ఐదవ విధాన సభల్లో స్థానాలు 287 ఆరవ విధానసభ స్థానాల సంఖ్య 294. విధానపరిషత్తు స్థానాల సంఖ్య 90. రాజ్యాంగరీత్యా, ఆంగ్లో-ఇండి యన్ కమ్యూనిటీకి చెందిన వ్యక్తి ఎవ్వరూ శాసనసభకు ఎన్నిక కానట్లయితే, రాష్ట్ర గవర్నరు విధానసభకు ఆ కమ్యూనిటీ నుండి తగు మందిని నామినేట్ చేయవచ్చును. 1957 నుండి విధాన సభకు ఒక ఆంగ్లో-ఇండియన్ వ్యక్తిని నామినేట్ చేయడం జరుగుతుంది విధానసభ స్థానాలలో షెడ్యూల్డు కులాల,

తరగతుల వారికి రిజర్వేషన్ ఉన్నది. ప్రతి విధానసభలో సాధారణ స్థానాల సంఖ్య, రిజర్వుడు స్థానాల సంఖ్య క్రింద సూచించబడ్డాయి.

## విధానసభ స్థానాలు

| విధానసభ | సాధారణ స్థానాలు | రిజర్వుడు స్థానాలు షెడ్యూలు కులాలకు | షెడ్యూలు తరగతులకు | మొత్తం స్థానాలు |
|---|---|---|---|---|
| 1957-62 | 247 | 43 | 11 | 301 |
| 1962-67 | 246 | 43 | 11 | 300 |
| 1967-72 | 236 | 40 | 11 | 287 |
| 1972-78 | 236 | 40 | 11 | 287 |
| 1978— | 244 | 39 | 11 | 294 |

విధాన పరిషత్తు శాశ్వత సభ దాని సభ్యుల సంఖ్య 90. వీరిలో 1/3 వ వంతు 6 సంవత్సరముల కొకసారి మారుదురు. విధానసభ కాలపరిమితి 5 సంవత్సరాలు. ఈ కాలపరిమితిని పార్లమెంటు కొన్ని ప్రత్యేక సమయాలలో పొడగించవచ్చు. 42వ రాజ్యాంగ సవరణద్వారా విధానసభల కాలపరిమితిని 6 సంవత్సరముల వరకు పెంచారు. కాని జనతా ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత ఈ కాలపరిమితిని పాత స్థితికే తీసుకపోవడానికి నిర్ణయించారు.

విధానసభకు ఎన్నిక కావడానికి వ్యక్తులు భారత పౌరులై, 25 సంవత్సరాల వయస్సు దాటి ఉండాలి. ప్రజా ప్రాతినిధ్య చట్టం చేసిన ఇతర షరతులకు లోబడి కూడా ఉండాలి. ఎన్నికైన తరువాత విధానసభా సభ్యత్వానికి రాజీనామా చేయవచ్చును. ఏకకాలంలో రెండు సభలలో సభ్యుడుగా ఉండకూడదు. విధాన మండలి సభ్యులకు పెక్కు ప్రత్యేకాధికారాలు, వసతులు కలవు. విధాన మండలిలో ప్రకటనా స్వాతంత్ర్యం చాలా ఎక్కువ.

విధానసభ సభ్యులు విధాన సభ స్పీకరును, డిప్యూటీ స్పీకరును తమలో నుండి ఎన్నుకొంటారు. విధాన పరిషత్తు సభ్యులు తమలో నుండి ఛైర్మన్‌ను.

డిప్యూటీ ఛైర్మన్‌ను ఎన్నుకొంటారు. క్రిందివారు ఇప్పటివరకు విధానసభ స్పీకర్లు, డిప్యూటీ స్పీకర్లుగా పనిచేసారు.

| స్పీకరు | డిప్యూటీ స్పీకరు |
|---|---|
| 1) ఎ. కాళేశ్వరరావు | 1) కొండాలక్ష్మణ్ బాపూజి |
| 2) బి. వి. సుబ్బారెడ్డి | 2) టి. ఎన్. సదాలక్ష్మి |
| 3) కె. వి. వేమారెడ్డి | 3) వాసుదేవ్ నాయక్ |
| 4) పి. రంగారెడ్డి | 4) సి. జగన్నాధరావు |
| 5) ఆర్. దశరథరామరెడ్డి | 5) రహ్మత్ అలీ |
| 6) డి. కొండయ్యచౌదరి | 6) కె. ప్రభాకర్ రెడ్డి |

విధానపరిషత్తు ఛైర్మన్‌లుగా, డిప్యూటి ఛైర్మన్‌లుగా క్రిందివారు ఇప్పటి వరకు పనిచేసారు.

| ఛైర్మన్ | డిప్యూటి ఛైర్మన్ |
|---|---|
| 1) మాడపాటి హన్మంతరావు | 1) జి. సుబ్బరాజు |
| 2) గొట్టిపాటి బ్రహ్మయ్య | 2) ఎం. ఆనందం |
| 3) పిడతల రంగారెడ్డి | 3) ఎర్రం సత్యనారాయణ |
| 4) తోట రామస్వామి | 4) సయ్యద్ ముఖసిర్ షా |
| 5) నివర్తి వెంకటసుబ్బయ్య | |

స్పీకర్, డిప్యూటి స్పీకర్, ఛైర్మన్, డిప్యూటి ఛైర్మన్‌లు పార్టీ రాజకీయాలకు అతీతంగా వ్యవహరించాలి. పార్టీలమీద ప్రేమానురాగాలు, ద్వేషాలు ఉండరాదు. ఇంతవరకు మన రాష్ట్రంలో వీరు నిష్పక్షపాతంగా స్వతంత్రంగా వ్యవహరించారనే చెప్పుకోవచ్చును. రాజకీయాలలో ఆరితేరినవారికి ఒక్కొసారి ఈ పదవులపై మక్కువ లేకపోవచ్చును. మంత్రులపై పెత్తనం చెలాయించినా మంత్రులకుండే అధికారాలు వీరికి లేవు. అందువల్ల కొందరు అవకాశం వచ్చినప్పుడు ఈ పదవులకు రాజీనామా చేసి మంత్రి పదవులను పొందారు. స్పీకర్లుగా ఉన్న బి. వి. సుబ్బారెడ్డి, పి. రంగారెడ్డి మంత్రులయ్యారు. డిప్యూటి స్పీకర్లుగా ఉన్న కొండా లక్ష్మన్ బాపూజీ, సదాలక్ష్మి తమ పదవులకు రాజీనామా చేసి మంత్రులయ్యారు.

విధానసభ, విధాన పరిషత్తుల నిర్వాహణకు ప్రత్యేకమైన పాలనాశాఖ ఉన్నది. ఇది రాష్ట్ర సచివాలయంలో అంతర్భాగమైన శాఖయినా, ప్రత్యేకమైన విధానమండలి సచివాలయంగా పిలువబడుతుంది.

భారత రాజ్యాంగానికి తలపెట్టే కొన్ని సవరణలు రాష్ట్ర విధాన మండలి అనుమతిని పొందాలి. రాష్ట్రపతి ఎన్నికలలో విధానసభ సభ్యులు పాల్గొంటారు. రాజ్యాంగం పేర్కొన్న రాష్ట్ర అధికార జాబితాలోని విషయాలపై చట్టాలు చేసే అధికారం విధాన మండలికి ఉంది. అత్యవసరకాలంలో రాష్ట్ర అధికారాల జాబితాలలోని విషయాలపై అవసరమని తోచినచో పార్లమెంటే చట్టాలు చేయవచ్చును. ఒకవేళ విధాన మండలి, పార్లమెంటు రెండూ ఉమ్మడి జాబితాలోని ఒకే అంశముపై చట్టాలు చేసినప్పుడు పార్లమెంటు చట్టమే చెల్లుతుంది.

విధానసభ, విధాన మండలుల అధికార, అధికృతలలో తేడా ఉన్నది. విధాన పరిషత్తుకంటె విధానసభయే ముఖ్యమైనదిగా భావిస్తారు. దీనికి ప్రధాన కారణం ధనానికి సంబంధించిన బిల్లులు విధాన పరిషత్తులో ఉత్పన్నంకావు. ఇతర బిల్లులు రెండు సభలలో దేనిలోనైన ఉత్పన్నం కావచ్చును. ఒక బిల్లు చట్టరూపం పొందటానికి రెండు సభల ఆమోదం కావాలి.

జనరల్ ఎన్నికల తర్వాత వెంటనే జరిగే విధాన మండలి సమావేశంగాని, సంవత్సర ప్రారంభంలో జరిగే సమావేశంగాని గవర్నరు ఉపన్యాసంతో ప్రారంభమవుతుంది. విధాన సభ మరియు పరిషత్తు సభ్యులను కలిపి గవర్నరు మొదట ప్రసంగిస్తారు. గవర్నరు పసంగంపై సభలలో చర్చసాగుతుంది. తరువాత గవర్నరు ప్రసంగించినందుకు సభ కృతజ్ఞతా తీర్మానాన్ని చేస్తుంది. సమావేశ ప్రారంభంలో ఉపన్యసించినట్లే గవర్నరు సమావేశాన్ని ముగిస్తుకూడ ఉపన్యసించవచ్చు. కాని ఇంతవరకు ఈ విధంగా జరుగలేదు.

సభలలో జరిగే రోజువారి కార్యక్రమం సభల కార్యక్రమ సలహా సమితియే నిర్ణయిస్తుంది. విధానసభ, విధాన పరిషత్తులలో వేరు వేరు కార్యక్రమ సలహా సమితులు ఉన్నాయి. ఈ సమితిలో ప్రతి పార్టి, గ్రూపుల చీఫ్‌విప్ కూడా సభ్యులుగా ఉంటారు. ఏయే అంశంపై ఎంతకాలము చర్చ సాగించాలో ఈ సమితులు నిర్ణయిస్తాయి.

## సభా కార్యక్రమము

సభలలో ప్రతిదినం సర్వసాధారణంగా మొదటి గంట ప్రశ్నల కాలంగా ఉంటుంది. ప్రశ్నోత్తరాల కాలంలో శాసనసభలు నిత్యకళ్యాణం పచ్చతోరణంగా ఉంటాయి. ప్రశ్నలు రకరకాలుగా ఉంటాయి.

నక్షత్ర ప్రశ్న (Starred Question):- ప్రశ్నలలో నక్షత్ర గుర్తు గల వానికి జవాబులు వాక్పూర్వకముగా చెప్తారు. ఎప్పుడైన ఎక్కువ సమాచారం ఇవ్వవలిసివస్తే వ్రాతమూలకంగా సభ్యులకు సమాచారం అందచేయవచ్చును. ఈ ప్రశ్నలపై ఉపప్రశ్నలు కూడ వేయవచ్చును.

నక్షత్రంలేని ప్రశ్నలు (Un Starred Questions):- ఈ ప్రశ్నలకు వ్రాత మూలకంగా మాత్రమే మంత్రులు జవాబిస్తారు. వీటిపై ఉపప్రశ్నలు అనుమతించరు.

స్వల్ప వ్యవధి ప్రశ్న (Short Notice Question) :- ఇవి కూడ నక్షత్ర ప్రశ్నలే. సాధారణంగా నక్షత్రము గుర్తులేని ప్రశ్నలను స్వల్ప వ్యవధి ప్రశ్నగా వేయరు. స్వల్ప వ్యవధి ప్రశ్నలు ప్రశ్నల గంట ముగిసిన తరువాత తీసుకొంటారు. దీని సమయం అదనంగా గమనిస్తారు. కోర్టులలో, ట్రిబ్యునలు లలో, విచారణలలో ఉన్న విషయాలపై ప్రశ్నలు వేయకూడదు. జవాబులు చెప్పరు.

అరగంట చర్చ (Half-an-Hour Discussion) :- నక్షత్రం గుర్తు ఉన్నవైన, లేనివైనా స్వల్ప వ్యవధి ప్రశ్నలలోని విషయాలను ప్రత్యేకంగా దృష్టికి తేదలచిన, ప్రభుత్వమునుండి ఇంకా ఎక్కువ సమాచారం పొందవలెనని ఆశించిన లేక ఎక్కువ చర్చ జరుగవలెనని ఆశించిన ఈ ప్రశ్నను ఉదహరిస్తూ దానిపై అరగంట చర్చకు అనుమతించవలసినదిగా ఆ రోజు ప్రశ్నల కాలం కాగానే కార్యదర్శికి అభ్యర్థన పంపాలి. దానిని స్పీకరు అంగీకరించిన రోజు నుండి మూడు రోజులలోగా రోజువారి కార్యక్రమం ముగిసిన వెంటనే చర్చకు అవకాశం ఇవ్వబడుతుంది. చర్చ కోరిన సభ్యుడు మాట్లాడవచ్చు. మంత్రి జవాబిస్తాడు. అరగంట కాగానే మంత్రి జవాబివ్వకపోయినా, సభ్యుడు మాట్లాడేది పూర్తి కాకపోయినా చర్చ ముగుస్తుంది.

వాయిదా తీర్మానం (Adjournment Motion) :- నిర్ణీత, అత్యవసర ప్రజా విషయంపై వాయిదా తీర్మానాన్ని ఏ సభ్యుడైన ప్రతిపాదించవచ్చును. ఆ విషయం వ్రాస్తూ దానిని చర్చించేందుకు సభా కార్యక్రమాన్ని వాయిదా వేయాలని కోరవలెను.

మంత్రి దృష్టికి తెచ్చే ప్రతిపాదన (Calling Attention Notice) :- ఏదైన సంఘటన, ప్రకటన, వ్యవహారాన్ని మంత్రి దృష్టికి తెచ్చేందుకు ఆ

విషయం వివరిస్తూ ఒక ప్రతిపాదనను అభ్యర్థించవచ్చును. దానిని వ్రాతపూర్వకంగా సభాపతికి అందించాలి. అది మంత్రికి పంపబడి వీలైనంత త్వరలో ఏదో ఒక రోజు ప్రశ్నల కాలం అయిన తరువాత ప్రతిపాదన చేసిన సభ్యుడు విషయాన్ని వివరిస్తూ మూడు నిమిషాలు మాట్లాడవచ్చు. అటుపై మంత్రి వివరిస్తాడు. దానిపై చర్చకు అవకాశంలేదు.

అత్యవసర ప్రజా సమస్యలపై స్వల్ప చర్చ :- అత్యవసర ప్రజా సమస్యలపై చర్చించవలసినదిగా అభ్యర్థిస్తూ సభ్యులు కార్యదర్శికి అభ్యర్థన అందించవచ్చు. దానిని వ్రాతమూలంగా స్పీకరు కందించాలి. మరో ఇద్దరు సభ్యులు దానిని బలపరచాలి. అటు తరువాత మంత్రి దానిని అంగీకరించాలి. మంత్రి అంగీకరిస్తే శాసనసభా నాయకునితో స్పీకరు సంప్రదించి కాలాన్ని నిర్ణయిస్తాడు. దీనిపై ఓటింగు ఉండదు. చర్చ మాత్రం రెండు గంటలకు మించకుండా జరుగుతుంది.

అవిశ్వాస తీర్మానం (No Confidence Motion) :- మంత్రి వర్గంపై ఏ సభ్యుడైన అవిశ్వాసం ప్రకటిస్తూ తీర్మానం ప్రతిపాదించవచ్చును. మీటింగుకు ముందుగా అట్టి నోటీసును కార్యదర్శికి అందచేయవలెను. అట్టి ప్రతిపాదన సరిగా ఉందని తలిస్తే స్పీకరు ప్రశ్నలకాలం తరువాత దీనిని ప్రస్తావించి దీనికి సభ యొక్క అనుమతి ఉన్నదా అని కోరుతాడు. మొత్తం సభ్యులలో 1/5 వంతు సభ్యులు అంగీకరిస్తే సభ అనుమతించినట్లుగా పరిగణించి కార్యక్రమ సమితితో సంప్రదించి కాలం నిర్ణయిస్తాడు. నిర్ణయించిన కాలంలో చర్చ జరుగుతుంది. ఆ తరువాత తీర్మానంపై ఓటింగు జరుగుతుంది. తీర్మానం నెగ్గితే మంత్రివర్గం రాజీనామా చేస్తుంది. ఆంధ్రప్రదేశ్ శాసనసభలో ఇంతవరకు అటువంటి తీర్మానం నెగ్గలేదు.

శాసనసభా సమితులు (Legislative Committees) :— శాసన సభలలో కమిటీలు లేక సమితులు చాలా ప్రాముఖ్యం వహిస్తాయి. పెక్కు విషయాలను కూలంకషంగా చర్చించటానికి శాసన సభలలో కాలం చాలదు కావున సమితులే కార్యక్రమాలను వివరణాత్మకంగా పరిశీలిస్తాయి. విధాన సభకు, పరిషత్తుకు కలసి కొన్ని సమితులు సంయుక్తంగా ఉన్నాయి. విధాన సభకు ప్రత్యేకంగా కొన్ని, విధాన పరిషత్తుకు ప్రత్యేకంగా కొన్ని సమితులు

ఉన్నాయి. ప్రస్తుతం మన రాష్ట్ర విధాన మండలిలోని సమితుల స్వరూపాలను పట్టికలో ఇవ్వనైనది.

## శాసనమండలి సమితులు

| సమితి | సమితి సభ్యుల సంఖ్య | సమితి అధ్యక్షుడు |
|---|---|---|
| **విధానసభ, పరిషత్తు సంయుక్త సమితులు** | | |
| అంచనాల సమితి | 20 | స్పీకర్ చే నామినేషన్ |
| ప్రభుత్వ ఖాతాల సమితి | 20 | ,, |
| ప్రభుత్వ సంస్థల సమితి | 20 | ,, |
| అనుగత చట్ట నిర్మాణ సమితి | 16 | ,, |
| షెడ్యూల్ కులాల సంక్షేమ సమితి | 12 | ,, |
| షెడ్యూల్ జాతుల సంక్షేమ సమితి | 12 | ,, |
| వెనుకబడిన తరగతుల సంక్షేమ సమితి | 12 | ,, |
| గ్రంథాలయ సమితి | 10 | ,, |
| సదుపాయాల సమితి | 12 | ,, |
| **విధానసభ సమితులు** | | |
| కార్యక్రమ సలహా సమితి | 11 | స్పీకరు |
| నియమాల సమితి | 15 | ,, |
| ప్రభుత్వ హామీల సమితి | 15 | స్పీకర్ చే నామినేషన్ |
| విశేషాధికారాల సమితి | 15 | ,, |
| అర్జీల సమితి | 7 | డిప్యూటీ స్పీకర్ |
| **విధాన పరిషత్తు సమితులు** | | |
| కార్యక్రమాల సమితి | 8 | ఛైర్మన్ |
| నియమాల సమితి | 10 | ,, |
| ప్రభుత్వ హామీల సమితి | 7 | ఛైర్మన్ చే నామినేషన్ |
| విశేషాధికారాల సమితి | 8 | ,, |
| అర్జీల సమితి | 10 | డిప్యూటీ ఛైర్మన్ |

బిల్లులు-చట్టాలు (Bills&Acts) :- ఏ సభ్యుడైన, లేక మంత్రి అయిన తాను ఉద్దేశించే చట్టం యొక్క ముసాయిదా (Bill) ను ప్రతిపాదించుటకు విధాన మండలి కార్యదర్శి ద్వారా నోటీసు ఇవ్వవచ్చును. ఆ నోటీసుతోపాటు బిల్లు ప్రతిని కూడ జతపరచాలి. బిల్లులోని ఆశయాలను వివరించే ప్రకటనకూడ ఉండాలి. బిల్లులు రెండు రకములు. ఒకటి మంత్రులు ప్రతిపాదించే 'అధికార బిల్లులు', రెండు మంత్రులు కాని వారు ప్రతిపాదించే 'అనధికార బిల్లులు', రాజ్యాంగ సూత్రాల ననుసరించి గవర్నరు అనుమతిగాని, గవర్నరు రాష్ట్రపతి నిర్దేశం కావలెనన్నప్పుడు వారి అనుమతిగాని రానిదే కొన్ని బిల్లులు చర్చించ బడవు. బిల్లులపై చర్చ జరిగిన తరువాత విధాన మండలి ఆమోదించిన తరువాత గవర్నరు అంగీకరిస్తే బిల్లు చట్టం అవుతుంది. కొన్ని శాసనాలను రాష్ట్రపతి ఆమోదం కొరకు కూడ పంపుతాడు.

ద్రవ్య వినియోగపు బిల్లు – ద్రవ్య బిల్లు (Appropriation Bill-Financial Bill) :- ద్రవ్య వినియోగపు బిల్లును బడ్జెటు అంటారు. ఆయా పద్దుల క్రింద నిర్దేశించిన మొత్తాలను కలిపి సంచిత నిధి (Consolidated Fund) క్రింద పరిగణించి అందులో ఆయా పద్దుల క్రింద అంతకు మించని మొత్తాలను ఖర్చు చేయుటకు ప్రభుత్వానికిఅధికారం ఇచ్చే బిల్లును ద్రవ్య బిల్లు (Financial Bill) అని అంటారు. ద్రవ్య బిల్లులో పన్నులు వేసే బిల్లులు కూడ ఉంటాయి. ఈ రెండు రకాల బిల్లులు విధానసభలోనే ప్రతిపాదించబడాలి. విధాన పరిషత్తులో ప్రతిపాదించుటకు వీలులేదు. విధానసభ చర్చించి విధాన పరిషత్తుకు పంపుతారు. విధానపరిషత్తు వాటిని అంగీకరించవచ్చు లేదా అంగీకరించక సవరణలు సూచించి విధానసభకు పంపవచ్చు. ఆ సవరణలను విధానసభ అంగీకరిస్తే సరే, లేక అంగీకరించకపోయినచో విధానసభలో ఆమోదమయిన రీతిలోనే బిల్లులు ఆమోదించబడినట్లు భావించబడును.

బడ్జెటు :- ప్రభుత్వం చేసే ఖర్చు అంతటికి విధాన మండలి ప్రత్యేకంగా అధికారం ఇవ్వాలి. ప్రభుత్వ నిధులమీద విధాన సభకు మాత్రమే అధికారం ఉన్నది. ధన విషయాలన్నిటిలోను ప్రభుత్వం విధానమండలి చేసే నిర్ణయాలను అమలుపరిచే కార్య నిర్వాహక సంస్థగా వ్యవహరిస్తుంది. ప్రభుత్వం జరిపే ద్రవ్య సంబంధమైన రోజువారి లావాదేవీలను పరిశీలించుటకు గాని, ఆమోదించుటకుగాని సంవత్సరము పొడువున సమావేశం కావడానికి విధాన మండలికి

వీలుండదు. కాబట్టి ఒక విధానాన్ని రూపొందించారు. దాని ప్రకారంగా ప్రభుత్వం ఆశించే ఆదాయాలను, ఖర్చుకు స్థూలంగా కొన్ని ఖాతాపద్దుల క్రింద వర్గీకరిస్తూ వచ్చే సంవత్సరానికి సంబంధించిన ఆర్థిక వివరణను లేదా బడ్జెటును రూపొందించుతుంది. రాజ్యాంగము ప్రకారం రాష్ట్ర సంచిత నిధి నుండి ఏదైన ఖర్చు చేయడానికి ముందుగా బడ్జెటును విధాన మండలి ముందుంచి దాని ఆమోదం పొందాలి. అయితే విధాన మండలి అనుమతి అక్కరలేని ఖర్చు పద్దులుకూడా కొన్ని ఉన్నాయి. వాటిని చార్జి చేసిన (Charged) ఖర్చు అంశాలుగా పరిగణిస్తారు. అంటే ఖర్చు అంశాలు స్థూలంగా రెండు రకాలు. 1) చార్జి చేసినవి, 2) ఓటు చేసినవి.

క్రింది పేరాలో ప్రతి విధానసభలోని పార్టీ బలాలను వర్ణించడం జరిగింది.

## రెండవ విధానసభ (Second Assembly) 1955 - 62

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన వెంటనే ఎన్నికలు జరుగలేదు. 1955లో ఆంధ్ర రాష్ట్రంలో మధ్యంతర ఎన్నికల ద్వారా వచ్చిన సభ్యుల కాలపరిమితి 1962 వరకు పొడగించబడింది. హైద్రాబాదు రాష్ట్రంలోని తెలంగాణా ప్రాంతంలో 1952 ఎన్నికల ద్వారా వచ్చిన సభ్యుల కాలపరిమితి 1957 ప్రారంభంలో అయిపోవడం వలన, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత ఇతర రాష్ట్రాలతో పాటు 1957లో తెలంగాణా ప్రాంతం ఒక్కదానిలోనే ఎన్నికలు జరిగినవి. ఆంధ్రప్రదేశ్ అవతరణ సమయం నుండి 1962 ఎన్నికల వరకు ఉన్న విధానసభను రెండవ విధానసభ అనటం వాడుక. రెండవ విధానసభలో పార్టీ బలాబలాలు క్రింది పట్టికలో సూచించబడినవి.

### రెండవ విధాన సభలో పార్టీ బలాబలాలు

| పార్టీ | 1957 మార్చి |
|---|---|
| యునైటెడ్ కాంగ్రెసు ఫ్రంటు | 216 |
| కమ్యూనిస్టులు + పీపుల్స్ డెమొక్రాటిక్ ఫ్రంటు | 37 |
| ప్రజా సోషలిస్టులు | 14 |
| ఇండిపెండెంట్లు + ఇతరులు | 34 |
| మొత్తం | 301 |

1957 ఎన్నికల తరువాత రాజకీయంగా వచ్చిన మార్పులు విధానసభలోని పార్టీ బలబలాలను మార్చినవి. 1957 ఎన్నికల తర్వాత 1962 ఎన్నికలకు ముందు కాంగ్రెస్ పార్టీలో తిరుగుబాటుదార్లు కాంగ్రెస్ పార్టీని వీడి, మొదట డెమొక్రాటిక్ పార్టీగాను తరువాత సోషలిస్టులతో కలసి సోషలిస్టు డెమొక్రాటిక్ పార్టీగా ఏర్పడ్డారు. 1959లో స్వతంత్రపార్టీ అవతరించడంతో కొందరు విధాన సభ సభ్యులు దానిలో చేరారు.

## మూడవ విధానసభ (Third Assembly) 1962-67

నిర్ణీత సమయాల్లో మూడవ విధానసభలోని పార్టీల బలాలు క్రింది పట్టికలో చూపబడినవి.

### మూడవ విధాన సభలో పార్టీ బలాలు

| పార్టీ | 1962 మార్చి | 1964-65 | 1966 నవంబరు |
|---|---|---|---|
| కాంగ్రెస్ | 177 | 210 | 215 |
| కమ్యూనిస్టు | 51 | 31 | 1 |
| మార్క్సిస్టు | — | 22 | — |
| సోషలిస్టు | 2 | — | — |
| స్వతంత్ర | 19 | 17 | 4 |
| నేషనల్ డెమొక్రటిక్ గ్రూపు | — | 7 | 3 |
| ఇండిపెండెంట్లు + ఇతరులు | 51 | 13 | 2 |
| ఖాళీలు | — | — | 75 |
| మొత్తం | 300 | 300 | 3౦0 |

1966 చివరినాటికి రాష్ట్రంలో చెలరేగిన ఉక్కు కర్మాగార స్థాపన ఆందోళన ఫలితంగా దాదాపు 75 మంది శాసనసభ్యులు తమ సభ్యత్వానికి రాజీనామా చేసినారు. మూడవ విధానసభ మొత్తం 316 రోజులు కార్యక్రమాలు నడిచాయి. ఈ కాలంలో 8731 నక్షత్రపు ప్రశ్నలకు 280 స్వల్పకాల

ప్రశ్నలకు జవాబులివ్వబడ్డాయి. 1414 నక్షత్రం గుర్తులేని ప్రశ్నలకు సమాధానాలివ్వబడ్డాయి ఈ కాలంలో 120 బిల్లులు పాస్ అయ్యాయి.

## నాల్గవ విధానసభ (Fourth Assembly) :- 1967-72

1967 లో జరిగిన సాధారణ ఎన్నికల ఫలితంగా విధాన సభలో పార్టీల బలాబలాల్లో మార్పులు వచ్చినవి. కాంగ్రెస్ పార్టీ బలం మొదటి సారిగా మునుపటికన్న తగ్గిపోయినది. ఈ సభలో ఒక విశేషమేమనగా ఎన్నికైన 68 మంది స్వతంత్రులు మరియు ఇతరులు విధానసభ కాలం ముగిసే నాటికి ఏదో ఒక పార్టీలో చేరడం జరిగినది. 1971 డిసెంబరు నాటికి 10 మంది మాత్రమే మిగిలారు. ఈ విధానసభా కాలంలోనే మార్క్సిస్ట్ పార్టీ ప్రముఖుడు తరిమెల నాగిరెడ్డి విధానసభా సభ్యత్వానికి రాజీనామా చేసాడు. ప్రస్తుత పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థలో, కర్షకులకు, కార్మికులకు న్యాయం చేకూరదని నమ్మిన ఫలితంగా రాజీనామా చేశాడు. ఈ విధానసభా కాలంలోనే దాదాపు 80 సంవత్సరాల చరిత్ర గల కాంగ్రెస్ సంస్థ మొదటిసారిగా చీలికై రాష్ట్ర స్థాయిలో రెండు కాంగ్రెస్‌లు ఏర్పడ్డాయి. మరొక ప్రత్యేకత ఏమనగా రాష్ట్రంలో ప్రత్యేక తెలంగాణా రాష్ట్రంకోసం పెద్ద ఎత్తున ఉద్యమం జరగడం మరొక ప్రత్యేక విశేషం. లోక్‌సభకు మొదటిసారిగా మధ్యంతర ఎన్నికలు ఈ కాలంలోనే జరగడం. మధ్యంతర లోక్‌సభ ఎన్నికలలో తెలంగాణా ప్రాంతంలోని 14 స్థానాలలో 10 స్థానాలు గెలిచిన తెలంగాణా ప్రజా సమితి నాల్గవ విధానసభ ముగిసే లోపల క్రొత్త కాంగ్రెలో చేరిపోయింది. 1967 ఎన్నికలలో ఇండిపెండెంట్లుగా పోటీచేసి గెలుపొందిన కాంగ్రెస్ తిరుగుబాటుదార్లు, పీపుల్స్ డెమొక్రాటిక్ పార్టి ఏర్పరిచినారు. కొందరు కాంగ్రెస్ తిరుగుబాటుదార్లు జన కాంగ్రెస్ పేరున మరొక పార్టీని ఏర్పరిచినారు. 1967 జూన్‌లో పీపుల్స్ డెమొక్రాటిక్ పార్టీ సభ్యులు కొందరు కాంగ్రెస్‌లో చేరినారు. తరువాత కొంతకాలానికి జనకాంగ్రెస్, స్వతంత్ర కలిసి డెమొక్రాటిక్ ఫ్రంటుగా ఏర్పడినాది. ఈ ఫ్రంటు బలం 42 శాసన సభ్యులు. ఇది వినధాసభలో ప్రధాన

ప్రతిపక్షంగా గుర్తించబడినది. నాల్గవ విధానసభలో భిన్నకాలాలలోని పార్టీల బలాలు క్రింది పట్టికలో ఇవ్వబడినాయి.

## నాల్గవ విధాన సభలో పార్టీలో బలాలు

| పార్టీ | 1967 ఫిబ్రవరి | 1971 మార్చి | 1971 డిసెంబరు |
|---|---|---|---|
| కొత్త కాంగ్రెస్ | 165 | 182 | 280 |
| పాత కాంగ్రెస్ | — | 3 | — |
| స్వతంత్ర | 29 | 16 | 10 |
| కమ్యూనిస్టు | 11 | 10 | 12 |
| మార్క్సిస్టు | 9 | 7 | 5 |
| తెలంగాణా ప్రజాసమితి | — | 26 | — |
| రిపబ్లికన్ | 1 | 2 | 2 |
| సంయుక్త సోషలిస్టు | 1 | 1 | 1 |
| జనసంఘ్ | 3 | 3 | 3 |
| పీపుల్సు డెమొక్రాటిక్ పార్టీ | — | 3 | 2 |
| ఇండిపెండెంట్లు ఇతరులు | 68 | 15 | 8 |
| ఖాళీలు | — | 9 | 14 |
| మొత్తం | 237 | 287 | 287 |

## ఐదవ విధానసభ (Fifth Assembly) 1972-78

1972 ఎన్నికలలో గెలుపొందిన ఇండిపెండెంట్లు కొందరు రకరకాల ఫ్రంటులుగా ఏర్పడినారు. 11 మంది సభ్యులు ప్రోగ్రెసివ్ ఫ్రంటుగా, 8 మంది సభ్యులు ఆంధ్రప్రదేశ్ ప్రోగ్రెసివ్ డెమొక్రాట్స్‌గా మరికొంత కాలానికి 11 మంది సభ్యులు సోషలిస్టు డెమొక్రాటిక్ ఫ్రంటుగా, 6 గురు సభ్యులు పీపుల్స్ డెమొక్రాట్స్‌గాను ఏర్పడినారు. కొంతకాలం తరువాత వీరందరు కాంగ్రెస్‌లో కలిసిపోయినారు. ఈ విధానసభ కాలంలోనే రాష్ట్రపతి పాలన కొంతకాలం (జనవరి 1973 నుండి డిసెంబరు 1974 వరకు) అమలులోనున్నది. ఈ కాలంలోనే అత్యవసర పరిస్థితి ప్రకటింపబడి రద్దుకావడం కూడ జరిగింది. అత్యవసర కాలంలో విధానసభ కాలపరిమితి 5 సంవత్సరాల నుండి 6 సంవత్సరాలకు పొడగింపబడి 1978 వరకు అమలులో ఉన్నది. 1977 డిసెంబరులో కాంగ్రెస్

ప్రచ్ఛన్నంగా రెండుగా చీలిన సందర్భంగా 44 మంది సభ్యులు ఇందిరా నాయకత్వంలోని కాంగ్రెస్‌పట్ల మద్దతును ప్రకటించారు. కాంగ్రెస్‌లోని కొందరు ఇతరులు జనతా పార్టీలో కలిసిపోయినారు.

ఐదవ విధానసభ భిన్న కాలాలలో పార్టీల బలాబలాలు ఈ క్రింది పట్టికలో చూపబడినవి.

## ఐదవ విధానసభలో పార్టీ బలాలు

| పార్టీ | 1972 ఫిబ్రవరి | 1972 సెప్టెంబరు | 1975 మే | 1977 ఏప్రిల్ |
|---|---|---|---|---|
| కాంగ్రెస్ | 219 | 218 | 242 | 248 |
| కమ్యూనిస్టు | 7 | 8 | 8 | 8 |
| మార్క్సిస్టు | 1 | 1 | 1 | 1 |
| స్వతంత్ర | 2 | — | — | — |
| సోషలిస్టు డెమొక్రాటిక్ ఫ్రంటు | — | 11 | 6 | — |
| ఆ.ప్ర. ప్రోగ్రెసివ్ డెమొక్రాట్సు | — | 8 | 7 | — |
| ప్రోగ్రెసివ్ ఫ్రంటు | — | 7 | 6 | — |
| జనతా ఫ్రంటు | — | — | — | 27 |
| ఇండిపెండెంట్లు ఇతరులు | 58 | 26 | 13 | 2 |
| పీపుల్సు డెమొక్రాట్సు | — | 6 | 3 | — |
| ఖాళీలు | — | 2 | 1 | — |
| మొత్తం | 287 | 287 | 287 | 287 |

## ఆరవ విధానసభ (Sixth Assembly) :- 1978

1978 ఎన్నికలకు ముందు కాంగ్రెస్ రెండుగా చీలి ఎన్నికలలో పోటీ చేసింది. ఇందిరా కాంగ్రెస్‌కు ఎన్నికలలో అఖండ విజయం లభించింది. ఎన్నికల ఫలితాలు ప్రకటించిన వెంటనే ఇందిరా కాంగ్రెస్ సంఖ్యా బలం పెరిగినది. విధానసభ మొదటి సమావేశం తరువాత ఈ సంఖ్యాబలం మరింతగా పెరిగినది. మొదటిసారిగా కమ్యూనిస్టు పార్టీకి (మార్క్సిస్టు-లెనినిస్టు) ప్రాతినిధ్యం లభిం

చినది. ఈ ఎన్నికలలో ఒక విశేషం ఏమనగా ఇండిపెండెంట్లు పూర్వపు ఎన్నికలకంటే చాలా తక్కువ సంఖ్యలో గెలవడం. 60 మంది సభ్యులు గల జనతా పార్టీ ప్రధాన ప్రతిపక్షంగా గుర్తించబడింది. ప్రతిపక్ష నాయకునికి క్యాబినెట్ మంత్రి హోదా ఇవ్వబడినది. 1978 ఎన్నికల తరువాత ఏర్పడిన విధానసభలోని పార్టీల బలాలు క్రింద ఇవ్వబడినవి

## ఆరవ విధాన సభలో పార్టీ బలాలు

| పార్టీ | 1978 ఫిబ్రవరి | 1978 ఏప్రిల్ |
|---|---|---|
| కాంగ్రెస్ | 30 | 15 |
| ఇందిరా కాంగ్రెస్ | 175 | 194 |
| జనతా | 60 | 60 |
| కమ్యూనిస్టు | 6 | 6 |
| మార్క్సిస్టు | 8 | 7 |
| మజ్లిస్ | 3 | 3 |
| ఇండిపెండెంట్లు + ఇతరులు | 12 | 8 |
| ఖాళీలు | — | 1 |
| మొత్తం | 294 | 294 |

# మంత్రివర్గాలు

- ఎం. సత్యనారాయణరావు

ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటి నుండి ఇంతవరకు 10 మంత్రి వర్గాలు ఏర్పాటయినవి. వీటికి 6 గురు ముఖ్యమంత్రులు నాయకత్వం వహించారు. ప్రతి సారీ నాయకత్వపు ఎన్నిక జటిలమయిన సమస్యగా తయారై, విభిన్న మార్గాల ద్వారా పరిష్కారమయ్యేది. ఈ వ్యాసంలో విభిన్న మంత్రివర్గాలను గురించి క్లుప్తంగా వర్ణించడం జరిగింది.

## సంజీవరెడ్డి మొదటి మంత్రివర్గం

1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడినపుడు రాష్ట్ర నాయకత్వంకోసం, అప్పటి ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి బెజవాడ గోపాలరెడ్డి, ఉప ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి పోటీపడ్డారు. పూర్వపు హైదరాబాద్ ముఖ్యమంత్రిగా ఉన్న బూర్గుల దగ్గరికి ఆంధ్రప్రదేశ్‌కు తొలి ముఖ్యమంత్రిగా ఉండుటకై ఇరువురూ రాయబారాలు పంపారు. కాని తెలంగాణా ప్రాంత శాసనసభ్యులలో బూర్గుల వారికి వ్యతిరేకత వున్నది. బూర్గుల తన మంత్రివర్గ సభ్యులైన కొండా వెంకట రంగారెడ్డి మరియు మర్రి చెన్నారెడ్డిగార్లను సంప్రదించగా, తెలంగాణా శాసన సభ్యులలోనే తనకున్న వ్యతిరేకతను వారు ఆయనకు సూచించారు. వీరు మొదట్లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడటానికి వ్యతిరేకులు. చెన్నారెడ్డి సంజీవరెడ్డి నాయకత్వాన్ని వ్యతిరేకించి బెజవాడ గోపాలరెడ్డిని సమర్థించాడు. తెలంగాణా శాసనసభ్యులలో అధిక సంఖ్యాకులు సంజీవరెడ్డిని బలపరిచారు. అఖిలభారత కాంగ్రెస్ కమిటీ తరఫున వచ్చిన కార్యదర్శి శ్రీమన్నారాయణ నాయకుని ఎన్నికకు ముందు జరిపిన లాంఛనప్రాయం కాని ఎన్నికలో సంజీవరెడ్డికి ఎక్కువ సంఖ్యాబలం వున్నట్లు తెలిసినది. ఆనాటి నాయకుని ఎన్నికలో సంజీవరెడ్డిని ఆంధ్రప్రదేశ్ శాసనసభా కాంగ్రెసు పక్ష నాయకునిగా ఎన్నుకోవటం జరిగింది. ఇలా లాంఛనప్రాయం కాని పద్ధతిలో సంఖ్యాబలము తెలిసికొనటం భవిష్యత్‌లో జరిగే నాయకత్వ ఎన్ని

కలకు సంప్రదాయంగా నెలకొంది. పోటీకి సిద్ధమై బలాబలాలను తేల్చుకోవ టానికి సన్నిద్ధులైనప్పుడు కూడా యీ పద్ధతినే అనుసరించటానికి ప్రయత్నించారు.

కొద్దిమంది సహచరులతో సంజీవరెడ్డి ప్రథమ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశాడు. తనతో పోటీ చేసిన బెజవాడ గోపాలరెడ్డిని మంత్రివర్గంలో చేరవల సిందిగా ఆహ్వానించాడు. మొదట తటపటాయించినా ఒక నెల రోజులలోనే మంత్రి వర్గంలో చేరాడు. తెలంగాణా నుండి కొండా వెంకటరంగారెడ్డిని చేర్చు కొని మంత్రివర్గంలో రెండవ స్థానాన్ని యిచ్చాడు. రంగారెడ్డి అనుచరులతో జె. వి. నర్సింగరావును తీసికొన్నాడు కాని తనని వ్యతిరేకించిన చెన్నారెడ్డిని మంత్రివర్గంలోకి చేర్చుకోలేదు.

1957లో ఒక్క తెలంగాణా ప్రాంతంలోనే శాసనసభకు ఎన్నికలు జరిగి నవి. 1955లో ఆంధ్ర రాష్ట్రంలో ఎన్నికలు జరిగినందున ఆ శాసనసభ్యుల పదవీ కాలాన్ని 1962 వరకు పొడిగించారు. 1957 ఎన్నికల తరువాత నాయ కుని ఎన్నిక జరుగాలని చెన్నారెడ్డి లేవదీశాడు. కాని మరల సంజీవరెడ్డి నాయ కత్వంలోనే శాసన సభా కాంగ్రేసు పక్షం విశ్వాసము ప్రకటించింది. కాంగ్రెసు లోని మంత్రివర్గ వ్యతిరేకులు చెన్నారెడ్డి నాయకత్వంలో కాంగ్రెసు నుండి విడిపోయి డెమొక్రాటిక్ పార్టీ అనే కొత్త పార్టీని ఏర్పరచుకున్నారు. సోషలిస్టు పార్టీ నుండి చీలివచ్చిన పి. వి. జి. రాజుతో కలసి సోషలిస్టు డెమొక్రాటిక్ పార్టీగా రూపాం తరము చెందారు. కాని యీ నూతన పార్టీ ఎన్నో రోజులు నిలవలేకపోయింది. మళ్ళీ 1962 ఎన్నికల నాటికి వారందరూ కాంగ్రెసులో చేరారు. 1959 చివర వరకు సంజీవరెడ్డి బలమైన రాష్ట్ర నాయకుడుగా స్థిరపడ్డాడు, ప్రతిపక్షాలను ధైర్యంగా ఓడిస్తూ, రాజకీయంగా, ఆర్థికంగా విభిన్నమైన, బలహీనమైన ఆంధ్ర తెలంగాణాలను సమైక్యపరచి, పార్టీలో గట్టి వ్యక్తిగానూ, పరిపాలకుడుగా సంజీవరెడ్డి పేరుపొందాడు.

సంజీవరెడ్డి పదముగ్గురితో మంత్రివర్గాన్ని ఏర్పరిచాడు. ఉప ముఖ్యమంత్రి పదవి ఏర్పరచలేదు. ఆయన మంత్రివర్గంలో అయిదుగురు రెడ్లు, ముగ్గురు బ్రాహ్మణులు, ఒక వెలమ, ఒక కమ్మ, ఒక ముస్లిం, ఒక కాపు, ఒక వెనుకబడ్డ తరగతులకు చెందినవారు, ఒక హరిజనునికి స్థానం కల్పించాడు. తెలంగాణా

నుండి అయిదుగురు, కోస్తా జిల్లాల నుండి ఆర్గురు, రాయలసీమ నుండి ముగ్గురు వున్నారు. వీరిలో ఏడుగురు యిదివరలో మంత్రులుగా పనిచేసినవారున్నారు

1960లో సంజీవరెడ్డి అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నిక కావడంతో ముఖ్యమంత్రి పదవికి ఖాళీ ఏర్పడింది.

## సంజీవయ్య మంత్రివర్గం

పదవీ విరమణ చేస్తున్న సంజీవరెడ్డి బ్రహ్మానందరెడ్డిని శాసనసభా కాంగ్రెసు పక్ష నాయకుడుగా చేయాలనుకొని ప్రయత్నాలు ప్రారంభించాడు. సంజీవరెడ్డి సహచరుడుగా ఉంటూ, ఆయన కాంగ్రెసు అధ్యక్షుడు అగుటకు సహాయపడిన అల్లూరి సత్యనారాయణరాజు నాయకత్వాన్ని ఆశించాడు. సంజీవరెడ్డి వ్యతిరేకులంతా సత్యనారాయణరాజును బలపరిచారు. తెలంగాణా నుండి కొండా వెంకటరంగారెడ్డి కూడా పోటీ చేయాలనుకున్నాడు. కాని సంజీవరెడ్డికి అల్లూరి సత్యనారాయణరాజుకు మధ్య జరిగిన రాజీ సంప్రదింపులలో దామోదరం సంజీవయ్య రాజీ అభ్యర్థిగా నాయకుడయ్యాడు. సంజీవయ్య హరిజనుడు అగుటవలన కమ్యూనిస్టులపై దళితవర్గాలకున్న ప్రేమను కాంగ్రెసు వైపు మరల్చగలడని ఆశించారు. పద్నాలుగు మంది మంత్రులతో సంజీవయ్య మంత్రివర్గాన్ని ఏర్పరిచారు. తెలంగాణా సీనియర్ నాయకుడైన కొండా వెంకటరంగారెడ్డికి ఉప ముఖ్యమంత్రి పదవి ఇచ్చాడు. సంజీవరెడ్డి అనుచరులైన బ్రహ్మానంద రెడ్డి, ఎ. సి. సుబ్బారెడ్డిని కూడా మంత్రివర్గంలో చేర్చుకున్నాడు. మొదట్లో ఆశించినదానికంటె బలమైన నాయకుడయ్యాడు సంజీవయ్య. దళిత వర్గాల సంక్షేమానికై అనేక ప్రణాళికలను అమలుచేశాడు. సర్వీసుల్లో హరిజనుల రిజర్వేషన్ విషయమై జారీచేయబడ్డ ప్రభుత్వ ఉత్తర్వు ఆతని ప్రతికక్షులను సంఘటితపరచింది. ప్రదేశ్ కాంగ్రేసు ఎన్నిక సంఘానికి నామినేషన్లు చేసే విషయంలో సంజీవయ్యతో భేదాభిప్రాయం వచ్చి ఏ. సి. సుబ్బారెడ్డి మంత్రివర్గం నుండి వైదొలగాడు. బ్రహ్మానందరెడ్డి నాయకత్వంలో యూనిటీ ఫ్రంట్ ఏర్పడి సంజీవయ్యను ముఖ్యమంత్రి పదవి నుండి దింపడానికి గట్టి ప్రయత్నాలు చేశారు. సంజీవయ్యకు వ్యతిరేకంగా శాసన సభ్యుల సంతకాల సేకరణకూడా జరిగి, అధిష్ఠానవర్గంవారి సలహాపై విరమింపబడింది.

కులాల వారీగా, సంజీవయ్య మంత్రి వర్గంలో అయిదుగురు రెడ్లు, ఇద్దరు కమ్మ, ఒక బ్రాహ్మణ, ఇద్దరు క్షత్రియులు, ఒక కాపు, ఒక ముస్లిం, ఒక హరిజన, ఒక వెనుకబడ్డ కులస్థుడు ఉన్నారు. ప్రాంతీయంగా తెలంగాణావారు అయిదుగురు, కోస్తా జిల్లాలవారు ఏడుగురు, రాయలసీమవారు ఇద్దరు వున్నారు. ఇందులో ఆరుగురు యిదివరలో మంత్రులుగా పనిచేసినవారు. మంత్రి వర్గంలో సభ్యుడుగా వున్న పళ్లంరాజు ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవిని చేపట్టగానే రాజీనామా చేశారు. 1962 ప్రారంభంలో జరిగిన ఎన్నికలలో పార్టీ టిక్కెట్ల రద్దీలో గ్రూపుల బలాబలాలు మారినవి. మళ్ళీ రాష్ట్రానికి వచ్చే తలంపుతో సంజీవరెడ్డి అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎక్కువ శ్రద్ధ చూపాడు.

## సంజీవరెడ్డి రెండవ మంత్రివర్గం

1962 ఎన్నికల తరువాత సంజీవరెడ్డి శాసనసభా కాంగ్రెసు పక్ష నాయకుడుగా ఏకగ్రీవంగా ఎన్నికై మంత్రివర్గాన్ని ఏర్పాటుచేశాడు. పదిమంది మంత్రులు, మరియు ఆరుగురు స్టేట్ మంత్రులతో మంత్రివర్గం ఏర్పాటైంది. ఉప ముఖ్యమంత్రి పదవిని ఏర్పాటు చేయలేదు. తన ప్రతికక్షులైన సంజీవయ్య, అల్లూరి సత్యనారాయణరాజులను మంత్రివర్గములోనికి తీసికొనలేదు. తరువాత జూన్ మాసంలో సంజీవయ్య అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నిక అయ్యారు. సంజీవరెడ్డి తన మంత్రివర్గంలో చెన్నారెడ్డికి, నూకల రామచంద్రారెడ్డికి స్థానం కల్పించాడు. యీ కాలంలో మంత్రివర్గంలో విభేదాలు లేవు. చైనా యుద్ధంవల్ల ప్రకటింపబడ్డ అత్యవసర పరిస్థితికూడా తోడైంది. 1964 లో కమ్యూనిస్టు పార్టీ చీలిక కాంగ్రెసుకు మరీ బలం చేకూర్చింది.

కులాల వారీగా యీ మంత్రివర్గంలో ఆరుగురు రెడ్లు, ఇద్దరు కమ్మ, ఒక బ్రాహ్మణ, ఒక క్షత్రియ, ఒక ముస్లిం ఒక వైశ్య, ఒక వెనుకబడిన కులంవ్యక్తి, ఒక హరిజన మరియు ఇద్దరు యితర కులాలకు చెందినవారున్నారు. ప్రాంతీయులుగా ఏడుగురు తెలంగాణావారు, ఏడుగురు కోస్తా ప్రాంతంవారు, ఇద్దరు రాయలసీమ వారున్నారు.

1964లో కర్నూలు బస్సు మార్గాల జాతీయకరణ కేసులో సుప్రీంకోర్టు తీర్పు పురస్కరించుకొని సంజీవరెడ్డి ముఖ్యమంత్రి పదవికి రాజీనామా యిచ్చాడు.

ముఖ్యమంత్రిగా రాజీనామా చేశాడేకాని శాసనసభా కాంగ్రెసు పక్ష నాయకత్వాన్ని వదులుకోలేదు.

## బ్రహ్మానందరెడ్డి మొదటి మంత్రివర్గం

సంజీవరెడ్డి ఆశీస్సులతో బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి అయినాడు. సంజీవరెడ్డి మినహా ఆయన మంత్రివర్గంలోని సభ్యులంతా మంత్రులుగా చేరారు. మొదట్లో శాఖల మార్పుకూడా చేయలేదు ఆ తరువాత రెండు నెలలకు శాఖలలో మార్పులుచేసి జూన్ నెలలో మంత్రివర్గ విస్తరణ చేశాడు. నెహ్రూ మరణానంతరం ఏర్పడిన లాల్‌బహద్దూర్‌శాస్త్రి మంత్రివర్గంలో సభ్యుడుగా చేరడంతో రాష్ట్ర నాయకత్వానికి సంజీవరెడ్డి రాజీనామా యిచ్చి, బ్రహ్మానందరెడ్డిని నాయకుడుగా ఎన్నిక అయేటట్లు చేశాడు.

సంజీవరెడ్డి ఆశీస్సులతో ముఖ్యమంత్రి అయినా, బ్రహ్మానందరెడ్డి రాష్ట్ర రాజకీయాలలో సంజీవరెడ్డి ప్రమేయాన్ని తగ్గించదలచుకొన్నాడు. యిందుకు విశాఖ ఉక్కు ఫ్యాక్టరీ విషయంలో చెలరేగిన ఉద్యమం తోడైంది. 1965 చివర వరకు బ్రహ్మానందరెడ్డి సంజీవరెడ్డితో ప్రమేయంలేని స్వతంత్ర నాయకుడుగా రాష్ట్రంలో స్థిరపడ్డాడు. రాష్ట్ర రాజకీయాలలో సంజీవరెడ్డి అనుయాయులుగా ఉన్నవారిని పదవులనుండి తప్పించి తన సహచరులను ఎన్నిక చేయించాడు. దీనితో మంత్రివర్గంలోనే అసమ్మతి వర్గీయులు ఏర్పడ్డారు. వీరికి ఏ.సి సుబ్బారెడ్డి నూకల రామచంద్రారెడ్డి నాయకులు 1966 లో ఆలపాటి వెంకట్రామయ్య మృతివల్ల ప్రదేశ్ ఎన్నికల సంఘంతో ఏర్పడ్డ ఖాళీని భర్తీ చేయుటకు జరిగిన ఎన్నికలలో బలాబలాలు చూసుకున్నారు. ఎన్నికలలో మంత్రి వర్గీయులు, అసమ్మతి వర్గంవారు సమానంగా పాల్గొన్నారు. మంత్రివర్గం వారికి విజయం లభించింది. బ్రహ్మానందరెడ్డి మీద ధ్వజం ఎత్తడానికి అసమ్మతి వర్గీయులు, కేంద్రంలో మంత్రులుగా ఉన్న సంజీవరెడ్డి మరియు సంజీవయ్యల మధ్య రాజీ కుదిర్చారు. కాంగ్రెసు అధిష్టానవర్గం యిరువర్గాలమధ్య రాజీకి ప్రయత్నించింది. యిరువర్గాలవారు 1967 ఎన్నికలలో తమకు వ్యతిరేకులైన అధికార అభ్యర్థులను ఓడించడానికి స్వతంత్ర అభ్యర్థులను పోటీకి నిలబెట్టారు. అనేక మంది స్వతంత్ర అభ్యర్థులు గెలిచారు. కాని చాలమంది తరువాత కాంగ్రెసులో కలిసిపోయారు. ఎన్నికలలో ముగ్గురు మంత్రులు కూడా ఓడిపోయారు.

## బ్రహ్మానందరెడ్డి రెండవ మంత్రివర్గం

1967 ఎన్నికల తర్వాత బ్రహ్మానందరెడ్డి తిరుగులేని నాయకుడయ్యాడు. ఎన్నికలకు ముందు నాయకత్వానికి పోటీ చేస్తానన్న ఏ.సి. సుబ్బారెడ్డి, ఫలితాలను ప్రకటించినాక విరమించుకున్నాడు. బ్రహ్మానందరెడ్డి నాయకుడుగా ఎన్నికై తన రెండవ మంత్రివర్గాన్ని ఏర్పరచాడు. ప్రదేశ్ ఎన్నికల సంఘంలో తన విజయానికి పాటుపడ్డ చెన్నారెడ్డికి మంత్రివర్గంలో రెండవ స్థానం కల్పించాడు కాని అతిత్వరలోనే కేంద్ర మంత్రి పదవి చేపట్టుటకు చెన్నారెడ్డి రాష్ట్ర మంత్రివర్గం నుండి రాజీనామా చేశాడు. చెన్నారెడ్డికి కేంద్ర మంత్రిత్వము లభించడం బ్రహ్మానందరెడ్డి నేర్పుగా చెన్నారెడ్డిని రాష్ట్ర రాజకీయాలనుండి తప్పించడానికి చేసిన ప్రయత్నమని తలపబడినది. అసమ్మతి వర్గీయులు మంత్రివర్గంలోకి తీసుకొనబడలేదు. చివరకు ఏ. సి. సుబ్బారెడ్డి మంత్రిగా చేరాడు. ఇంతకుముందున్న వర్గాలు సమసిపోయినప్పటికి నూతనమైన స్పర్థల ఫలితంగా రాష్ట్ర రాజకీయాలను కలుషితం చేస్తినాయి. ఉద్యోగాల విషయంలో సుప్రీంకోర్టు తీర్పువల్ల బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో క్లిష్టదశ ఏర్పడింది. మంత్రివర్గ సహచరుడైన కొండా లక్ష్మణ్ బాపూజీ తెలంగాణాకు ప్రాంతీయ స్వయం పరిపాలనా ప్రతిపాదనను ప్రచారం చేయడాన్ని తక్కిన మంత్రులు సహించలేకపోయారు. కొండాలక్ష్మణ్ మంత్రి పదవికి రాజీనామా చేశాడు. ఇంతలో తన ఎన్నిక విషయంపై సుప్రీంకోర్టు ఇచ్చిన వ్యతిరేక తీర్పువల్ల కేంద్ర మంత్రి పదవి వదలుకొని చెన్నారెడ్డి రాష్ట్రానికి వచ్చాడు. నాయకత్వంలేని తెలంగాణా ఉద్యమానికి నాయకత్వం వహించాడు. ఉద్యమం తీవ్రతరమైంది. మొదట్లో విద్యార్థులు ఉద్యోగస్థులతో ప్రారంభమైన ఉద్యమం చివరకు కాంగ్రెసులో అసమ్మతి వర్గీయుల మద్దతు సంపాదించింది. అందరూ బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గాన్ని రద్దుపరచి అధ్యక్షపాలన ఏర్పడాలని కోరటం మొదలుపెట్టారు. యీ పరిస్థితిలో బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలోని ఎనిమిది మంది తెలంగాణా మంత్రులు రాజీనామా చేసి రాజకీయ రంగంలో క్లిష్ట పరిస్థితిని ఏర్పరిచారు. బ్రహ్మానందరెడ్డి కూడా రాజీనామాను ప్రకటించాడు. జాతీయ నాయకత్వానికి ఆ రోజుల్లో ఉన్న క్లిష్ట పరిస్థితివల్ల ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజకీయాల్లో కేంద్రం జోక్యం చేసుకోలేకపోయింది. తిరిగి శాసనసభా కాంగ్రెసు పక్షం, బ్రహ్మానందరెడ్డిని ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు.

బ్రహ్మానందరెడ్డి రెండవ మంత్రివర్గంలో కులాల వారీగా రెడ్లు అయిదుగురు, ఇద్దరు కమ్మ, ఒక బ్రాహ్మణ, ఒక క్షత్రియ, యిద్దరు వెనుకబడిన తరగతులవారు, యిద్దరు హరిజనులు, ఒక ముస్లిం ఒక వైశ్య మరియు యిద్దరు ఇతర కులాలవారు ఉన్నారు. ప్రాంతీయంగా తొమ్మిది మంది తెలంగాణావారు, ఆర్గురు కోస్తా జిల్లాలవారు, ఇద్దరు రాయలసీమ వారు.

## బ్రహ్మానందరెడ్డి మూడవ మంత్రివర్గం

1969 జూలై నెలలో ఏకగ్రీవంగా ఎన్నుకొనబడిన బ్రహ్మానందరెడ్డి తన మూడవ మంత్రి మండలిని ఏర్పరచాడు. దీనిలో మొత్తం సభ్యుల సంఖ్య 28. ఆంధ్రప్రదేశ్ అప్పటివరకు ఏర్పడిన మంత్రి వర్గాలన్నిటిలోనూ పెద్దది. తెలంగాణా ఉద్యమకారులను సంతృప్తిపరచటానికి, పెరుగుతున్న కాంగెసు పార్టీ ముఠా కలహాలను తగ్గించటానికి మంత్రివర్గం ఏర్పాటులో బ్రహ్మానందరెడ్డి ప్రయత్నించాడు. ప్రతి జిల్లాలోని యిరు ముఠాలకు చెందిన వారిని మంత్రివర్గంలోకి తీసికొనడం జరిగింది. తెలంగాణా నాయకుడైన జె.వి. నర్సింగరావును ఉపముఖ్యమంత్రి చేశాడు. కులాల వారీగా యిందులో ఎనిమది మంది రెడ్లు, నల్గురు కమ్మ, ముగ్గురు బ్రాహ్మణ, ఇద్దరు క్షత్రియ, ముగ్గురు వెనుకబడిన కులాలవారు, ఇద్దరు హరిజనులు, ఒక ముస్లిం, ఒక పార్టీ నల్గురు యితరులు వున్నారు. ప్రాంతీయంగా 12 మంది తెలంగాణాకు, 12 మంది కోస్తా జిల్లాలకు, 4గురు రాయలసీమకు చెందినవారు.

1969లో జాతీయ స్థాయిలోని కాంగ్రెస్ చీలిక ఆంధ్ర ప్రదేశ్ రాజకీయాలపై ప్రభావం కలుగచేయలేదు. ఆంధ్రప్రదేశ్‌లోని వర్గాలవారందరు కేంద్రంలో ఇందిరాగాంధీకి విధేయులైనారు. రాష్ట్రపతి ఎన్నికలో సంజీవరెడ్డికి బదులు వి. వి. గిరికి ఓటు చేశారు. రాష్ట్ర రాజకీయాలలో పరస్పరం కలహించుకున్న కాంగ్రెస్, తెలంగాణా ప్రజాసమితి జాతీయ స్థాయిలో ఇందిరాగాంధీ నాయకత్వాన్ని బలపర్చారు. 1971లో జరిగిన మధ్యంతర లోక్‌సభ ఎన్నికలలో తెలంగాణాలోని 14 సీట్లలో 10 సీట్లు ప్రజాసమితి వశపరచుకుంది. దీంతో బ్రహ్మానందరెడ్డి నాయకత్వపు బలహీనత బయటపడ్డది. కాంగ్రెస్ అధిష్టానవర్గంవారు ప్రజాసమితి సభ్యులను కాంగ్రెస్‌లో చేరవలసిందని ఆహ్వానించారు. చెన్నారెడ్డి బ్రహ్మానందరెడ్డి నాయకత్వాన్ని మార్చమని పట్టుబట్టాడు. కేంద్రంలో

బలంగా స్థిరపడ్డ ప్రధానమంత్రి బ్రహ్మానందరెడ్డిని, నాయకత్వం నుంచి తప్పుకో మని సలహా యిచ్చింది.

## పి. వి. నరసింహారావు ప్రథమ మంత్రివర్గం

బ్రహ్మానందరెడ్డి రాజీనామాతో మళ్లీ నాయకత్వ సమస్య తలయెత్తింది. ఈసారి కాంగ్రెస్ అధిష్ఠానవర్గం నాయకుని ఎన్నికలో ఎక్కువగా జోక్యం చేసు కొంది. తెలంగాణా వారిలో నాయకత్వానికి పోటీ ప్రారంభమైంది. తెలంగాణా నుండి పోటీచేయ ఉత్సాహము చూపిన చొక్కారావు, వెంగళరావు, నరసింహా రావు- వారిలో నరసింహారావు నాయకుడుగా ఎన్నిక అవటంతో బ్రహ్మానందరెడ్డి వర్గం కాంగ్రెస్ అధిష్ఠానవర్గంతో సహకరించింది. 1971 సెప్టెంబరు చివరి వారంలో పి. వి. నరసింహారావు ఏకగ్రీవంగా శాసనసభా కాంగ్రెస్ పక్ష నాయ కుడుగా ఎన్నికై నూతన మంత్రివర్గాన్ని ఏర్పాటుచేశాడు. బ్రహ్మానందరెడ్డి బద్ధ శత్రువు చెన్నారెడ్డి నరసింహారావును అభినందించినవారిలో మొదటివాడు. అంతకుముందే తెలంగాణా ప్రజాసమితి కాంగ్రెస్‌లో కలిసిపోయింది. 25 మంది సభ్యులతో మంత్రివర్గం ఏర్పాటు అయింది. రాయలసీమ నాయకుడైన బి. వి. సుబ్బారెడ్డి ఉప ముఖ్యమంత్రి అయ్యాడు. మొట్టమొదటిసారిగా కాంగ్రెస్ అధి ష్ఠానవర్గము మంత్రివర్గాన్ని ఏర్పాటుచేయటంలో నరసింహారావుకు సాయపడ్డది. జాతీయస్థాయిలో ఉన్న సంజీవయ్య రఘురామయ్యలు బ్రహ్మానందరెడ్డి వర్గపువారు మంత్రివర్గంలో లేకుండా చూశారు. దీంతో బ్రహ్మానందరెడ్డి వర్గం అసంతృప్తి చెంది ఎన్నికల తరువాత ప్రారంభమైన ప్రత్యేక ఆంధ్ర ఉద్యమానికి చేయూత యిచ్చారు.

మంత్రివర్గంలో కులాలవారీగా అయిదుగురు రెడ్లు, నలుగురు కమ్మ, ఇద్దరు బ్రాహ్మణులు, ఇద్దరు క్షత్రియులు, ఒక ముస్లిం, నలుగురు వెనుకబడిన తరగతులవారు, ముగ్గురు హరిజనులు, ఒక గిరిజనుడు, ముగ్గురు యితరులు. ప్రాంతీయంగా 12 మంది తెలంగాణావారు, ఎనిమిది మంది కోస్తా జిల్లాలవారు, అయిదుగురు రాయలసీమవారు.

1972లో జరిగిన ఎన్నికలకు కాంగ్రెస్ అభ్యర్థుల నియామకంలో చాలా మంది సీనియర్ నాయకులు నిరుత్సాహపడ్డారు. వెనుకబడిన కులాలవారు,

హరిజనులు ముస్లింలు ఎక్కువ మంది కాంగ్రెసు అభ్యర్థులుగా పోటీ చేశారు. మొదటిసారిగా అభ్యర్థుల నిర్ణయంలో ముఖ్యమంత్రి పి వి. నరసింహారావుకు పూర్తి అధికారం యిచ్చారు. ఆయన ఏర్పరచిన మంత్రివర్గంలో కూడా మొదటి సారిగా వెనుకబడిన వారికి ఎక్కువ మంత్రి పదవులు యివ్వడం జరిగింది. ఎన్నికలలో యిద్దరు మంత్రులు-చెంచు రామానాయుడు మరియు వాసుదేవరావులు ఓడిపోయారు.

## పి. వి. నరసింహారావు రెండవ మంత్రివర్గం

1972 లో అసెంబ్లీ ఎలక్షన్లు పూర్తికాగానే చాలమంది తెలంగాణా నాయకులు నాయకత్వ పోటీకి సిద్ధపడ్డారు కాని కాంగ్రెసు అధిష్టానవర్గం వారి మనసు తెలిసికొన్న పిమ్మట పోటీనుండి విరమించి మళ్ళీ నరసింహారావునే శాసనసభా కాంగ్రెసుపక్ష నాయకునిగా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. ఈతూరి నరసింహారావు 29 మందితో మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశాడు. బి.వి. సుబ్బారెడ్డికి ఉప ముఖ్యమంత్రి పదవి యిచ్చాడు. ముఖ్యమంత్రిగా నరసింహారావు ప్రధాని సూచించిన పెక్కు ప్రగతిశీలక కార్యక్రమాలను చేబట్టాడు. అందులో ముఖ్యంగా భూసంస్కరణల చట్టం ప్రశంసనీయమైనది. ఎక్కువ మంది నాయకులు ఆయనకు శత్రువులయ్యారు. ఆతని ముఖ్యమంత్రి పదవి తీరు సహచరులకు యిష్టం కాలేదు. చీటికి మాటికి ఢిల్లీ వెళ్ళడం, అధిష్టానవర్గం వారి సలహాలను పొందటం సహించలేకపోయారు. రాజకీయ వర్గాలలో అతని వ్యక్తిత్వం దెబ్బతిన్నది. వీనికితోడు ముల్కీ చట్టం విషయంపై 1972 అక్టోబరులో సుప్రీంకోర్టు యిచ్చిన తీర్పు తుది తీర్పని ముఖ్యమంత్రి వ్యాఖ్యానం చెప్పడంతో ఆంధ్ర ప్రాంతాన అగ్ని జ్వాలలు రేగి ప్రత్యేక ఆంధ్రోద్యమం తలెత్తింది. ప్రధాని సూచించిన పథకాన్ని చర్చించటంలో ముఖ్యమంత్రి అనుసరించిన విధానం చాలావరకు ఉద్యమానికి దోహదకారి అయింది. ఆంధ్ర తెలంగాణాలకు చెందిన మంత్రులతో విడివిడిగా సమావేశాలు కరిపి చర్చించటంవలన ప్రాంతియాభిమానాలు అధికం కావటానికి దోహదకారి అయినాడు. ముఖ్యమంత్రిగా ఉద్యమాన్ని అదుపులో పెట్టడంలో విఫలుడైనాడు. ఆంధ్ర ప్రాంతానికి చెందిన తొమ్మిది మంది మంత్రులు మూకఉమ్మడిగా రాజీనామా చేశారు. తన సుస్థిరతకు భంగం కలుగ రాదనే ఉద్దేశ్యంతో మంత్రివర్గాన్ని విస్తరించాడు. కాని ఎట్టకేలకు ఉద్యమానికి

ఆంధ్ర మంత్రులు యిచ్చిన ప్రోత్సాహంవల్ల ఉద్యమం ఉధృతం అయింది. కేంద్ర ప్రభుత్వం సలహా మేరకు నరసింహారావు ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేసిన తర్వాత రాష్ట్రంలో రాష్ట్రపతిపాలన ప్రవేశ పెట్టబడింది.

పార్టీ నాయకుల విశ్వాసాన్ని పొందలేక పోవటం, ప్రత్యేకమైన పరిపాలనా శైలి, నరసింహారావు పేరు ప్రతిష్టలను దెబ్బతీసాయి. కాంగ్రెసులోని కొన్ని వర్గాలు ఆయన ప్రగతిశీలక కార్యక్రమాలను సహించలేని స్థితికి వచ్చారు.

కులాల వారీగా ఆయన మంత్రివర్గంలో నలుగురు రెడ్లు, నలుగురు కమ్మ, ముగ్గురు బ్రాహ్మణ, ఇద్దరు క్షత్రియులు, ఒక ముస్లిం, ఆరుగురు వెనుకబడిన కులాలవారు, నలుగురు హరిజనులు, ఒకరు గిరిజనులు, నలుగురు ఇతర కులాల వారున్నారు. మంత్రివర్గంలో ప్రాంతీయంగా తెలంగాణా ప్రాంతానికి 13 గ్గురు, కోస్తా జిల్లాలకు 11 మంది, రాయలసీమకు 5 గురు ఉన్నారు.

## రాష్ట్రపతి పాలన

రాష్ట్రపతిపాలన విధించడంలో ప్రత్యేక ఆంధ్ర ఉద్యమము యొక్క ఉధృతము చల్లారి, నాయకులు సంప్రదింపులకు ప్రారంభం చేశారు. అధికారం లేకుండా ఉండటానికి నాయకులు అలవాటుపడలేకపోయారు చివరకు ఆరు సూత్రాల పథకంతో సమస్య పరిష్కారమై మళ్ళీ ప్రజా పరిపాలన సాగించటానికి ప్రయత్నాలు చేశారు. మళ్ళీ ప్రజా ప్రభుత్వం ఏర్పాటు అవుతుందని తెలియడంతోనే నాయకుల మధ్య మంతనాలు మొదలై, నాయకత్వ సమస్య ఎదురైంది. నరసింహారావు తాను ఇంకా శాసనసభ కాంగ్రెసుపక్ష నాయకుడినేనని ప్రకటించుకొని నాయకత్వ ఎన్నిక సమస్యలేదని ప్రకటించాడు. ప్రత్యేక ఆంధ్ర ఉద్యమవాదులు నరసింహారావును నాయకుడిగా గుర్తించడంలేదని విరుద్ధ ప్రకటనలు చేశారు. ఆంధ్ర నాయకులు నాయకత్వం మారవలసిందేనని పట్టు బట్టారు. నరసింహారావు తన మెజారిటీ నిరూపించుకోడానికి కూడా అవకాశము యివ్వలేదు. యీ పరిస్థితులలో కేంద్ర మంత్రి అయిన కొత్త రఘురామయ్య, మరికొందరు ఆంధ్ర పార్లమెంట్ సభ్యులు, జలగం వెంగళరావు నాయకుడుగా ఎన్నిక కావటానికి తోడ్పడ్డారు. నరసింహారావు వర్గము మరియు బ్రహ్మానందరెడ్డి వర్గము వెంగళరావు నాయకుడు కాకూడదని ప్రచారం చేశారు. చివరకు ప్రధాన

మంత్రికి వదలి వేయబడి, ఆమె స్వయంగా వెంగళరావును నాయకునిగా ఎన్నుకో బడడంతో ముగిసింది.

## వెంగళరావు మంత్రివర్గం

తెలంగాణా ప్రాంతీయుడైన వెంగళరావు నాయకుడుగా ఎన్నుకోబడి 17గురు మంత్రులతో నూతన మంత్రివర్గాన్ని ఏర్పరిచాడు. 1974 సెప్టెంబరు నెలలో మంత్రివర్గాన్ని 26 మందితో విస్తృతపరిచారు. క్రమేపి బ్రహ్మానందరెడ్డి వర్గాన్ని నరసింహారావు వర్గాన్ని చేర్చుకొని మంత్రివర్గాన్ని విస్తృతపరిచాడు. 1977 సెప్టెంబరులో అతని మంత్రివర్గ సహచరుల సంఖ్య 35. ఇది ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పడిన మంత్రివర్గాలన్నిటిలోనూ పెద్దది. రాయలసీమ నాయకుడైన బి.వి. సుబ్బారెడ్డికి ఉప ముఖ్యమంత్రి పదవి యిచ్చారు. కాని 1974 జూన్‌లో అతను మరణించాక, ఆ పదవి ఎవ్వరికి యివ్వలేదు. 1975 జూన్‌లో దేశంలో ప్రకటింపబడ్డ అత్యవసర పరిస్థితి అతని నాయకత్వాన్ని సుస్థిరం చేసింది. అన్ని వర్గాల వారికి మంత్రి పదవులు యిచ్చి కాంగ్రెసులో ఐక్యత సాధించాడు. రాష్ట్రాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చేయడంలో చాలా ప్రగతి సాధించాడు. 1977 మార్చిలో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో రాష్ట్రంలో 42 లోక్‌సభ స్థానాల్లో 41 స్థానాలు గెలుచుకొంది. వెంగళరావు పాలనా సామర్థ్యం, ప్రతిభే దీనికి కారణమన్నారు, 1977 ఎన్నికల తర్వాత జాతీయ స్థాయిలో జరిగిన మార్పులు ఆంధ్రప్రదేశ్‌ను విడిచిపెట్టలేదు. 1977 చివరకు మంత్రివర్గంలో స్పర్థలు రేగి కొందరు మంత్రులు జనతా పార్టీవైపు మరికొందరు కాంగ్రెసులోని ఇందిరాగాంధీ నాయకత్వం వైపుకు మొగ్గు చూపటం ప్రారంభించారు. నవంబరు నెలలో ఆంధ్ర ప్రాంతంలో వచ్చిన ఉప్పెన ప్రమాదాన్ని దానికై చేసిన పునరావాస కార్యక్రమాల విషయంపై 12 మంది మంత్రులు రాజీనామా చేశారు. అందులో ఆరుగురు జనతా పార్టీలో చేరారు. మిగతావారు ఇందిరా కాంగ్రెసులో చేరారు. 1978 ఫిబ్రవరి శాసనసభ ఎన్నికలలో సంభవించిన ఓటమివలన వెంగళరావు రాజీనామా చేయాల్సి వచ్చింది.

## చెన్నారెడ్డి మంత్రివర్గం

1978 ఎన్నికల్లో జనతాపార్టీ, అఖిలభారత కాంగ్రెసు ఓటమి చెంది ఇందిరా కాంగ్రెసు అపూర్వమైన విజయాన్ని సాధించింది. ఎన్నికలకు ముందే

ఉత్తరప్రదేశ్ గవర్నరుగా రాజీనామా చేసిన మర్రి చెన్నారెడ్డి రాష్ట్ర రాజకీయ రంగంలో ప్రవేశించి ఇందిరా కాంగ్రెసుకు సారథ్యం వహించాడు. ఎన్నికలలో 294 స్థానాల్లో 175 స్థానాలు ఇందిరా కాంగ్రెసువారు గెలుచుకున్నారు. నాయకత్వ ఎన్నిక సమస్య వచ్చేవరకు వెనుకబడిన కులాలకు చెందిన జి. రాజారాం తన అభ్యర్థిత్వాన్ని ప్రకటించాడు. చెన్నారెడ్డి నాయకత్వాన్ని బలపరచేవారు ప్రకటనలు చేశారు. కేంద్ర నాయకుల సంప్రదింపుల ఫలితంగా రాజారాం పోటీ నుంచి విరమించుకొని చెన్నారెడ్డి ఏకగ్రీవంగా ఎన్నిక అయేటట్లుగా సహాయం చేశాడు.

చెన్నారెడ్డి రాష్ట్ర రాజకీయాలకు చిరపరచితుడు. లోగడ హైదరాబాదు రాష్ట్రంలో మరల ఆంధ్రప్రదేశ్‌లో మంత్రిగా అనుభవంగలవాడు ఉత్తర ప్రదేశ్‌లో గవర్నరుగా పరిణితి పొందిన రాజకీయ నాయకుడు. అనేక ఉద్యమాలను విజయవంతంగా నడపిననేత. ఆయనకు రాష్ట్ర విభజనపైగల అభిప్రాయాలను విమర్శకులు ప్రశ్నించినప్పుడు సమైక్య రాష్ట్రంగా ఉండటాన్ని కాంక్షిస్తున్నానని ప్రకటన చేశాడు. 1978 మార్చి 6వ తేదీన చెన్నారెడ్డి మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశాడు. మంత్రివర్గంలో మొత్తం 32 మంది మంత్రులు, ఆరుగురు పార్లమెంటరీ కార్యదర్శులు వున్నారని పార్లమెంటరీ కార్యదర్శుల నియామకం నూతనమైన సాంప్రదాయం. మంత్రివర్గంలోని 32 మందిలో ఇరవై ఇద్దరు కొత్తవారు. ప్రాంతీయంగా 14 మంది తెలంగాణాకు, 9 మంది కోస్తా జిల్లాలకు మరి 10 మంది రాయలసీమకు చెందినవారున్నారు. కులాలను బట్టి ఎనిమిది మంది రెడ్లు, నలుగురు కమ్మ, ఇద్దరు బ్రాహ్మణులు, ఒక క్షత్రియ, ఒక వెలమ, ఇద్దరు కాపులు, ముగ్గురు ముస్లింలు, ఆరుగురు వెనుకబడిన కులాలవారు, నలుగురు హరిజనులు, ఒక పార్సీ, ఒకరు యితర కులానికి చెందినవారున్నారు.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడకముందు, ఆంధ్ర తెలంగాణాల నాయకులమధ్య సమైక్య రాష్ట్రం ఏర్పడేందుకు ఒక ఒప్పందం జరిగింది అంటారు. ఈ పెద్ద మనుష్యుల ఒడంబడికి ప్రకారం ఉప ముఖ్యమంత్రి పదవి ఉండాలి. ముఖ్యమంత్రి తెలంగాణా వాడైతే ఉప ముఖ్యమంత్రి ఆంధ్రులకు, ముఖ్యమంత్రి ఆంధ్ర ప్రాంతీయుడైతే, ఉప ముఖ్యమంత్రి తెలంగాణా వారికి యివ్వవలెను.

ఇప్పటివరకు ఉప ముఖ్యమంత్రి పదవి సంజీవయ్య, బ్రహ్మానందరెడ్డి (మూడవ), నరసింహారావు, వెంగళరావు మంత్రివర్గాలలో మాత్రమే ఉంది. ప్రభుత్వ శాఖల విభజనలో గూడా, హోం, ఫైనాన్సు, రెవిన్యూ, ప్లానింగు అండ్ డెవలప్‌మెంట్, కామర్సు అండ్ ఇండస్ట్రీ శాఖలలో ఏవైనా రెండు తెలంగాణా వారికి యివ్వవలెనను విషయంకలదు. శాఖల విభజనలో యీ సూత్రం అన్ని మంత్రి వర్గాల్లోను పాటించబడ్డది

## ముఖ్యమంత్రుల పదవీకాలం

| ముఖ్యమంత్రి | కాలం | | మొత్తం కాలం | | |
|---|---|---|---|---|---|
| | నుండి | వరకు | సం॥ | నెలలు | రోజులు |
| నీలం సంజీవరెడ్డి | 1-11-56 | 10-1-60 | 3 | 2 | 8 |
| దామోదరం సజీవయ్య | 11-1-60 | 11-3-62 | 2 | 2 | 0 |
| నీలం సంజీవరెడ్డి | 12-3-62 | 28-2-64 | 1 | 11 | 16 |
| కాసు బ్రహ్మానందరెడ్డి | 29-2-64 | 6-3-67 | 3 | 0 | 7 |
| ,, ,, | 6-3-67 | 18-7-69 | 2 | 4 | 12 |
| ,, ,, | 18-7-69 | 30-9-71 | 2 | 2 | 12 |
| పి. వి. నరసింహారావు | 30-9-71 | 20-3-72 | 0 | 5 | 20 |
| ,, ,, | 20-3-72 | 18-1-73 | 0 | 9 | 27 |
| జలగం వెంగళరావు | 10-12-73 | 5-3-78 | 4 | 2 | 25 |
| మర్రి చెన్నారెడ్డి | 6-3-78 | — | | | |

# పార్టీల బలాబలాలు

—కె. వి. నారాయణరావు

అవిభక్త మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెసు పార్టీ నాలుగు ప్రాంతీయ శాఖలుగా ఉండేది. ఈ నాలుగు శాఖలు-ఆంధ్ర, కన్నడ, తమిళ, మలబారు ప్రాంతీయ శాఖలు. 1921 నుండి ఈ శాఖలు ఆయా భాషా ప్రాంతాల పరిధికి పరిమితమైనవి. ఆంధ్ర, తమిళ ప్రాంతీయ కాంగ్రెస్ శాఖలు మద్రాస్ పట్టణం లోనే ఉంటూ తమకు ప్రత్యేక భాషా రాష్ట్రాలు ఏర్పడినప్పుడు మద్రాస్ తమతో కలిసి ఉండాలని కోరేవారు. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసేనాటికి ఆంధ్ర ప్రాంతములోని కాంగ్రెస్ వాదులు రెండు ముఠాలుగా ఉండేవారు. ఈ రెండు ముఠాలకు నాయకులు బ్రాహ్మణులే. ఒకరు పట్టాభి సీతారామయ్య, రెండోవారు, టంగుటూరి ప్రకాశం పంతులు. 1946 వ సంవత్సరంలో పరిమిత వోటు హక్కుతో రాష్ట్ర శాసనసభకు ఎన్నికలు జరిగాయి. ఎన్నికల తర్వాత బహు భాషా మద్రాస్ కాంగ్రెస్ శాసనసభా పార్టీకి, టంగుటూరి ప్రకాశం తమిళ శాసన సభ్యుల సహకారంతో నాయకుడై ముఖ్యమంత్రి అయ్యాడు. తమిళ శాసన సభ్యులలో ముఠా తత్వం ఫలితంగా కొందరు తమిళులు ప్రకాశంను బలపర చారు. కాంగ్రెస్ పార్టీలోని అంతర్గత మార్పులవల్ల 1947 లో ప్రకాశం స్థానే రామస్వామిరెడ్డియార్ ముఖ్యమంత్రి అయ్యాడు. మరుసటి సంవత్సరములో రామస్వామిరెడ్డియార్ కొనసాగలేక పోయాడు. దీనికి కారణం ఆంధ్ర కాంగ్రెస్ శాసన సభ్యులపై తన ఆధిపత్యాన్ని ప్రకాశం కోల్పోవడమే కాకుండా పట్టాభి సీతారామయ్య ముఠా బలపడడం కూడా. ఆధిపత్యం పోయిన వెంటనే ప్రకాశం రాష్ట్ర కాంగ్రెస్ మంత్రులపై కొన్ని అవినీతి ఆరోపణలను చేసి కాంగ్రెస్ అధి ష్ఠాన వర్గానికి తెలియజేశాడు. కాని కాంగ్రెస్ అధిష్ఠానవర్గం అట్టే పట్టించుకో లేదు. శాసన సభ్యులు తమ అవినీతికి, అసభ్యకర ప్రవర్తనకు తామే బాధ్యత వహించాలని అధిష్ఠానవర్గం భావించి వూరుకుందేగాని, దానిపై ఎట్టి చర్య తీసుకో లేదు. తరువాత ప్రకాశం ఆంధ్ర ప్రాంతంలో బలాన్ని పుంజుకోవాలని కృషి ప్రారంభించాడు. 1946 లో ఆంధ్ర ప్రాంత కాంగ్రెస్ అధ్యక్ష పదవికి జరిగిన

ఎన్నికల్లో ఆచార్య రంగాను బలపరచి పట్టాభి సీతారామయ్య వర్గీయుడైన నీలం సంజీవరెడ్డిని ఓడించాడు కాని ఈ విజయం చాలా కాలం నిలవలేదు. 1951 ఏప్రిల్‌లో ఆంధ్ర ప్రాంత కాంగ్రెస్ అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికలలో సంజీవరెడ్డి చేతుల్లో కొద్దిపాటి ఓట్ల తేడాతో రంగా ఓడిపోయాడు. దీనితో ప్రకాశం బలం సన్నగిల్లింది. ఈ పరిస్థితి రంగాను, ప్రకాశంను, మరి కొందరిని కాంగ్రెస్‌నుండి వైదొలగేటట్లుగా చేసింది. కాంగ్రెస్‌నుండి తొలగిపోయినవారు ప్రకాశం అధ్యక్షతన ప్రజా పార్టీని స్థాపించారు. అప్పటివరకు ప్రకాశం, కాంగ్రెస్ పార్టీలో కృపలానీ నాయకత్వంలోని కాంగ్రెస్ డెమొక్రాటిక్ ఫ్రంట్‌తో సంబంధం కల్గియుండెను. 1951 జూన్ పదహారవ తేదీన పాట్నాలో జరిగిన సదస్సులో కిసాన్ మజ్దూర్ పార్టీ ఆవిర్భవించింది. అప్పటినుండి ప్రకాశం అధ్యక్షతనున్న ప్రజా పార్టీ ఈ పార్టీకి అనుబంధ పార్టీగా ఏర్పడింది. అదే సంవత్సరం ఆగస్టులో రంగా ప్రకాశంతోను, కిసాన్ మజ్దూర్ పార్టీతోను పూర్తిగా సంబంధాలు తెంచుకొని కృషికార్ లోక్ పార్టీని స్థాపించాడు.

## 1952 ఎన్నికలు

1952లో జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ, కిసాన్ మజ్దూర్ పార్టీ, కృషికార్‌లోక్ పార్టీ విడివిడిగా పోటీ చేసాయి. ఆంధ్ర ప్రాంతం నుండి మద్రాస్ రాష్ట్ర శాసనసభకున్న 138 స్థానాల్లో కాంగ్రెస్ పార్టీ 134 స్థానాలకు పోటీ చేసి ఇతర పార్టీలకన్న ఎక్కువ ఓట్లు పొందింది. పోలైన ఓట్లలో 28.7 శాతం ఓట్లను సంపాదించింది. అయితే సంపాదించిన స్థానాలు 38 మాత్రమే. 15 స్థానాలలో ధరావత్తు కోల్పోయింది. 1952 నుండి ఇంతవరకు జరిగిన ఎన్నికలలో చెల్లిన ఓట్లలో ఈసారే తక్కువ ఓట్లను పొందటం, ఎక్కువ ధరావత్తులను కోల్పోవటం. సంపన్నమైన, రాజకీయ చైతన్యం ఎక్కువగా గల నాలుగు కోస్తా జిల్లాలలో-అంటే ఉభయ గోదావరులు, కృష్ణా, గుంటూరు జిల్లాలలో గల 41 స్థానాలలో 11 స్థానాలను మాత్రమే గెలుచుకొంది 7 స్థానాలలో ధరావత్తును కోల్పోయింది. రాయలసీమ జిల్లాలైన చిత్తూరు, కడప, అనంతపూర్, కర్నూలులలో 17 సీట్లను సంపాదించింది, మూడు స్థానాలలో మాత్రమే ధరావత్తు కోల్పోయింది.

1952 ఎన్నికలలో ఓడిపోయిన ఆంధ్ర కాంగ్రెస్ ప్రముఖులు— కళా వెంకట్రావ్, బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డి, కల్లూరి చంద్రమౌళి, వేముల కూర్మయ్య. వీరందరూ మద్రాస్ రాష్ట్రంలో మంత్రులుగా ఉన్నవారే. కాంగ్రెస్ వ్యక్తులకు, మాజీ కాంగ్రెస్ వ్యక్తులకు మధ్య తీవ్రమైన పోటీ జరగటం వలనను, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర స్థాపనకై ప్రయత్నం చేయకపోవటం వలన కోస్తా ప్రాంతాలలో కాంగ్రెస్ పార్టీ పరాజయం పొందింది.

ప్రకాశంగారి కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీ ఈ ఎన్నికల్లో 14.2 శాతం ఓట్లను సంపాదించింది. పశ్చిమ గోదావరి జిల్లాలో అన్ని స్థానాలను, తూర్పు గోదావరి, గుంటూరు, చిత్తూరు, కడప, నెల్లూరు, విశాఖపట్టణం, అనంతపురం జిల్లాలలో దాదాపు సగం స్థానాలకు పోటీ చేసింది. అన్ని జిల్లాల్లో 77 స్థానాలకు పోటీచేసి, 20 స్థానాలను మాత్రమే గెలుచుకొంది. 35 స్థానాల్లో ధరావత్తు కోల్పోయింది. శ్రీకాకుళం, కర్నూలు జిల్లాలలో ఒక స్థానాన్నికూడా సంపాదించలేక పోయింది. డెల్టా జిల్లాలలోను క్రిష్ణాజిల్లాల లోను ఒక స్థానాన్నికూడా సంపాదించ లేకపోయింది. ఇతర మూడు జిల్లాలలో 12 స్థానాలను సంపాదించకలిగింది. నెల్లూరు, కడప, అనంతపురం జిల్లాలలో ఒక్కొక్కదానిలో రెండేసి స్థానాలను, చిత్తూరు, విశాఖపట్టణం జిల్లాలలో ఒక్కొక్క స్థానాన్ని సంపాదించింది

కృషికార్ లోక్ పార్టీ 63 స్థానాలకు పోటీ చేసి, 8 శాతం ఓట్లతో 15 స్థానాలను గెలుచుకొని 26 స్థానాలలో ధరావత్తును కోల్పోయింది. ఈ పార్టీ శ్రీకాకళంలో అన్ని స్థానాలకు, విశాఖపట్టణంలోని 14 స్థానాల్లో 7 స్థానాలకు, తూర్పు గోదావరిలోని 16 స్థానాల్లో 8 స్థానాలకు, కృష్ణాలోని 12 స్థానాల్లో 4 స్థానాలకు, చిత్తూరులోని 10 స్థానాలలో 5 స్థానాలకు, కడపలోని 8 స్థానాలలో ఒక స్థానానికి, అనంతపురంలోని 10 స్థానాలలో ఒక స్థానానికి, కర్నూలులోని 10 స్థానాలలో 5 స్థానాలకు పోటీ చేసింది. పార్టీ నాయకుడైన రంగా స్వంత జిల్లా గుంటూరులోని 18 స్థానాలలో 15 స్థానాలకు పోటీ చేసి ఒక్క స్థానాన్ని కూడా గెలుచుకోలేదు. పైగా 7 స్థానాలలో ధరావత్తునుకూడ కోల్పోయింది. ఈ పార్టీ గెలుచుకున్న 17 స్థానాలలో 6 స్థానాలు శ్రీకాకుళంలోను, 6 స్థానాలు విశాఖపట్టణంలోను, ఒక స్థానం తూర్పు గోదావరిలోను, రెండు స్థానాలు చిత్తూరులోను, ఒక స్థానం కర్నూలులోను ఉన్నవి.

సోషలిస్టులు 1948లో సిద్ధాంతరీత్యా కాంగ్రెస్ నుండి వేరుపడినవారు. సోషలిస్టు పార్టీ 50 స్థానాల్లో అభ్యర్థులను నిలబెట్టి, 6 స్థానాలను గెలుచుకొని, 33 స్థానాలలో ధరావత్తును కోల్పోయినారు. శ్రీకాకుళం విశాఖపట్టణంలోని 29 స్థానాలలో 14 స్థానాలకు పోటీ చేశారు. డెల్టా ప్రాంతంలోని 40 స్థానాలలో 19 స్థానాలకు, కర్నూలు లోని 10 స్థానాలలో 6 స్థానాలకు, నెల్లూరులోని 4 స్థానాలలో 3 స్థానాలకు, చిత్తూరులో 3 స్థానాలకు, కడప అనంతపూర్‌లలో ఒక్కొక్క స్థానానికి పోటీచేసింది. ఈ పార్టీ గెలుచుకొన్న 6 స్థానాలలో 1 స్థానం శ్రీకాకుళంలో, 4 విశాఖపట్టణంలో, 1 కర్నూలులో ఉన్నవి. విశాఖపట్టణంలో సగం స్థానాలకే పోటీచేసినా, ఈ పార్టీ సంపాదించినన్ని ఓట్లు ఏ ఇతర పార్టీ సంపాదించలేదు. భిన్న జిల్లాలలో భిన్న పార్టీలకు వొచ్చిన స్థానాలు ఆయా పార్టీల నాయకులు కాంగ్రెస్‌లో ఉండగా ఆ ప్రాంతాలలో వారికున్న పలుకుబడి ద్వారా వచ్చినవే. శ్రీకాకుళంలో గౌతులచ్చన్నకు, విశాఖ పట్టణంలో పి. వి. జి. రాజు, తెన్నేటి విశ్వనాథంలకు, గుంటూరులో రంగాకు ఉన్న పలుకుబడి వల్ల ఆ యా ప్రాంతాలలో వారు గెలుచుటకు కారణం.

కమ్యూనిస్టుపార్టీ 63 స్థానాలకు పోటీ చేసి 41 స్థానాలను గెలుచుకొంది. ఆంధ్ర ప్రాంతంలో ఈ పార్టీ సంపాదించినన్ని స్థానాలను మరేపార్టీ సంపాదించ లేదు. కాంగ్రెస్ పార్టీకంటె తక్కువ ఓట్లను సంపాదించి దానికంటె ఎక్కువ స్థానాలను పొందింది. గెలిచిన 41 స్థానాల్లో 31 స్థానాలు డెల్టా ప్రాంతంలోనివి. కృష్ణా జిల్లాలో 46.3 శాతము ఓట్లతో 10 సానాలను గెలుచుకొంది.

## 1952 ఎన్నికల తర్వాత మార్పులు

1952 ఎన్నికలకు, 1953లో ఆంధ్ర రాష్ట్ర అవతరణకు ఉన్న మధ్య కాలంలో కృషికార్‌లోక్ పార్టీ మద్రాస్ రాష్ట్రంలోని రాజాజీ మంత్రివర్గానికి మద్దతును ఇచ్చి, కాంగ్రెస్ శాసనసభా పార్టీలో అసోసియేట్ సభ్యులుగా చేరారు. కిసాన్ మజూర్ ప్రజాపార్టీ, సోషలిస్టు పార్టీ కలసి 1952 సెప్టెంబర్‌లో జాతీయ స్థాయిలో ప్రజా సోషలిస్టు పార్టీగా రూపొందాయి. తత్ఫలితంగా మద్రాస్ రాష్ట్రంలో ప్రకాశం, ఆయన కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ అనుచరులు, ప్రజాసోషలిస్టు పార్టీలో అంతర్భాగమయ్యారు. ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటును

కేంద్ర ప్రభుత్వం ప్రకటించి, నూతన రాష్ట్రానికి ముఖ్య పట్టణాన్ని ఎంపిక చేసేబాధ్యతను మద్రాసు శాసన సభలోని ఆంధ్ర ప్రాంతపు శాసన సభ్యులకు వొదిలి వేసింది. ఈ చర్య పార్టీలలో కలవరాన్ని, కలతలను తెచ్చింది. కమ్యూనిస్టులు తమకు పలుకుబడిగల విజయవాడలోగాని, విజయవాడ-- గుంటూరుల మధ్యలోగాని, ముఖ్య పట్టణం ఉండాలన్నారు. దీనికి కాంగ్రెస్ వ్యతిరేకించింది. 1953 ఏప్రిల్‌లో కాంగ్రెస్‌లో అసోసియేట్ సభ్యులుగా ఉండటానికి ఒప్పుకున్న కృషీకార్ లోక్‌పార్టీ సభ్యులు, జూన్ నెలలో ప్రజా సోషలిస్టులు, కాంగ్రెస్‌వారు కర్నూలు రాష్ట్ర రాజధాని కావాలనే దానితో అంగీక రించారు. కొద్ది రోజుల తర్వాత తమ అభిప్రాయాన్ని మార్చుకొని, తిరుపతిలో గాని లేక చిత్తూరు జిల్లాలోని మరోప్రాంతం లోనైనా రాజధాని ఉండాలని అన్నారు. కిసాన్ మజ్దూర్ పార్టీ రాజధాని నిర్ణయ విషయాన్ని తమనాయకుడైన ప్రకాశానికి వదిలి పెట్టింది. ప్రకాశం కర్నూలును రాజధానిగా నిర్ణయించటం వలన ఆంధ్ర రాష్ట్రానికి కర్నూలు రాజధాని అయ్యింది.

1953 అక్టోబరు 1న ఆంధ్ర రాష్ట్రం ఏర్పడగానే, ఆ రాష్ట్రానికి మొదటి ముఖ్యమంత్రి కాంగ్రెస్ వ్యక్తే కావాలని ఆంధ్ర రాష్ట్ర కాంగెస్ కమిటీ అధ్యక్షుడు సంజీవరెడ్డి పట్టుపట్టాడు. అదే సమయంలో కాంగ్రెస్ అధిష్టాన వర్గం నూతన రాష్ట్ర ప్రభుత్వ నిర్మాణానికి ప్రకాశంయొక్క సహకారం అవసరమని భావించింది. ఆంధ్రలో ప్రజాస్వామిక ప్రభుత్వ నిర్మాణానికి తగు చర్యలను తీసుకునే అధికారం ప్రజా సోషలిస్టు పార్టీ ప్రకాశానికి వదిలివేసింది. ఈ పరిస్థితులలో ప్రకాశం ప్రజా సోషలిస్ట్ పార్టీకి రాజీనామాచేసి కాంగ్రెస్ పార్టీ అసోసియేట్ సభ్యుడుగా ముఖ్యమంత్రి అయినాడు. ప్రజా సోషలిస్ట్ పార్టీ ప్రకాశం మంత్రివర్గంలో చేరడానికి ఇష్టపడక పోవడంవల్ల, ఆ పార్టీలోని పాత కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ సభ్యులు తెన్నేటి విశ్వనాథం నాయకత్వాన ప్రజా సోష లిస్ట్ పార్టీని వదిలి ప్రకాశం మంత్రివర్గంలో చేరడానికి నిర్ణయించుకొన్నారు. తత్ఫలితంగా తెన్నేటి విశ్వనాథం ప్రకాశం మంత్రివర్గంలో ఆర్థిక శాఖామంత్రి అయ్యాడు. కృషీకార్ లోక్‌పార్టీ మంత్రి వర్గాన్ని తొలుత బలపరచడంతో, దాని నాయకుడైన గౌతు లచ్చన్న మంత్రి వర్గంలోకి తీసుకోబడ్డాడు. తర్వాత రాజధాని విషయంపై మంత్రివర్గం నుండి రాజీనామా చేశాడు. ఈ విధంగా ఆంధ్రరాష్ట్ర ప్రథమ మంత్రివర్గం కాంగ్రెస్, ప్రజా పార్టీలతో కూడిన

సంకీర్ణ మంత్రివర్గమైంది కమ్యూనిస్ట్ పార్టీ, కృషికార్ లోక్ పార్టీ, ప్రజా సోషలిస్ట్ పార్టీ ప్రతిపక్షాలుగా పనిచేశాయి.

## 1955 మధ్యంతర ఎన్నికలు

మంత్రివర్గం ఏర్పడిన 13 నెలల తర్వాత 1954 నవంబరులో కృషికార్ లోక్ పార్టీ నాయకుడు లచ్చన్న ప్రభుత్వంపై తెచ్చిన అవిశ్వాస తీర్మానం గెలుపొందిన ఫలితంగా ఆంధ్రరాష్ట్ర మంత్రివర్గం రాజీనామా చేసింది. అవిశ్వాస తీర్మానానికి అనుకూలంగా 69 ఓట్లు, వ్యతిరేకంగా 68 ఓట్లు వచ్చాయి. 1951 జనాభా లెక్కల ఆధారంగా జరిగిన నియోజక వర్గాల పునర్ వ్యవస్థీకరణ ఫలితంగా రాష్ట్రంలోని నియోజక వర్గాల సంఖ్య 195కు పెరిగింది. 1952 ఎన్నికలలో పొందిన విజయంవల్ల కమ్యూనిస్టు పార్టీ తానే స్వయంగా ప్రభుత్వాన్ని ఏర్పరచ గలనని భావించి ఎన్నికల రంగంలోకి పెద్ద ఎత్తున దూకింది. పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలలోని మొత్తం 166 స్థానాలకు పోటీ చేసింది. కమ్యూనిస్టులు ఎన్నికలలో నెగ్గుతారేమోననే భయంతో కమ్యూనిస్టేతర పార్టీలైన కాంగ్రెసు, కృషికార్ లోక్, ప్రజాపార్టీలు ఏకమై ఒక ఐక్య సంఘటనగా ఏర్పడ్డాయి.

కమ్యూనిస్టులు విదేశాల తొత్తులని కాంగ్రెసు ఐక్యసంఘటన బహుళ ప్రచారం చేసింది. ఎన్నికల్లో కాంగ్రెస్ ఐక్యసంఘటన 147 స్థానాలను సంపాదించింది. ఐక్య కాంగ్రెస్ సంఘటన గెలుచుకున్న స్థానాలలో కాంగ్రెస్‌కు 119, కృషికార్ లోక్‌పార్టీకి 22 స్థానాలు, ప్రజాపార్టీకి 6 స్థానాలు ఉన్నవి. కాంగ్రెస్ 4 స్థానాలలో ధరావత్తును కోల్పోగా, కృషికార్, ప్రజాపార్టీలు ఎక్కడా ధరావత్తును కోల్పోలేదు. 1952 ఎన్నికలలో 19.9 శాతం ఓట్లు సంపాదించిన కమ్యూనిస్టులు ఈ సారి 31 శాతం ఓట్లను సంపాదించారు. కాని వారు గెలుచుకొన్న స్థానాలు 15 మాత్రమే. ఈ 15 స్థానాలలో 6 తూర్పుగోదావరిలోను, 4 నెల్లూరులోను, 3 కృష్ణాలోను, 2 గుంటూరులోను ఉన్నవి. ఓట్ల సంఖ్య పెరగడానికి కారణం పార్టీ అభ్యర్థుల సంఖ్య ఎక్కువగా ఉండటమే. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయడానికి కాంగ్రెస్ పార్టీ కృషిచేయలేదన్న విషయాన్ని

కమ్యూనిస్టులు ఆచారంగా చేసుకొని 1952 ఎన్నికలలో ఎక్కువ స్థానాలనుపొంద గలిగారు. మధ్యంతర ఎన్నికల నాటికి ఆంధ్రరాష్ట్రం ఏర్పడి ఉండడం కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా ఏర్పడింది. కమ్యూనిస్టులకు గతంలో కల్పించిన ఆవకాశం లేకుండా పోయింది.

మధ్యంతర ఎన్నికలలో ప్రకాశం గెలిచినప్పటికి ఆయనను ముఖ్యమంత్రి పదవికై ఎవరూ తలంచలేదు. కృషికార్ లోక్‌పార్టీకి, ప్రజాపార్టికి ప్రాతినిధ్యం కల్పించి గోపాలరెడ్డి కొత్త మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేశాడు. సంజీవరెడ్డి తనకు పూర్వం ఉన్న ఉప ముఖ్యమంత్రి పదవిని నిలబెట్టుకున్నాడు. మంత్రివర్గం ఏర్పడిన కొంతకాలానికి కృషికార్ లోక్‌పార్టి కాంగ్రెస్‌లో కలిసిపోయింది. ప్రజాపార్టి మాత్రం ప్రత్యేక ప్రతిపత్తిని కొనసాగించింది.

## 1952లో తెలంగాణాలో ఎన్నికలు

ఈ నాటి తెలంగాణాకు హైదరాబాదు రాష్ట్రంలో 1952లో మొదట ఎన్నికలు జరిగినపుడు, శాసన సభలో 101 స్థానాలుండేవి. కాంగ్రెస్ 99 స్థానాలకు పోటీచేసి 44 స్థానాలను గెలుచుకొంది. 5 స్థానాల్లో ధరావత్తు కోల్పోయింది, పోలయిన ఓట్లలో 38.2 శాతం పొందింది.

నిషేధింపబడ్డ కమ్యూనిస్టు పార్టి సభ్యులు, వామపక్షీయులు కలసి ఏర్పరచిన పీపుల్స్ డెమొక్రటిక్ ఫ్రంట్ 45 స్థానాలకు పోటీచేసి 36 స్థానాలను గెలుచుకుంది, 26.1 శాతం ఓట్లను పొందింది. నల్గొండ జిల్లాలోని అన్ని స్థానాలకు, వరంగల్లులో 6 స్థానాలు, కరీంనగర్‌లో 7 స్థానాలు, ఖమ్మంలో 5 స్థానాలు గెల్చింది. నిజామాబాద్ జిల్లాలో ఒక స్థానాన్ని గూడా పొందలేదు. తెలంగాణా ప్రాంతంలో తమకు ఆధిక్యత ఉన్నా విశాలాంధ్ర రాష్ట్రాన్ని కోరటం కమ్యూనిస్టుల విశేషం. కమ్యూనిస్టులు కూడా ఇతరులతో పాటు తెలంగాణాకు ప్రత్యేక ప్రతిపత్తిని కోరిఉంటే, ప్రత్యేక తెలంగాణా ఏర్పడి ఉంటే కమ్యూనిస్టుల ప్రాబల్యము ఎలా ఉండేదో!

తెలంగాణాలో సోషలిస్టు పార్టి 13.7 శాతం ఓట్లు సంపాదించి 10 స్థానాలను గెల్చింది. ఆంధ్రప్రదేశ్ అవతరణ తర్వాత తెలంగాణాలోని పెక్కు సోషలిస్టులు కాంగ్రెస్‌లో కలిసిపోయారు.

## 1957 ఎన్నికలు

ఆంధ్రప్రదేశ్‌కు సంజీవరెడ్డి తొలి ముఖ్యమంత్రి. ముఖ్యమంత్రి పదవిని ఆశించిన బెజవాడ గోపాలరెడ్డి సంజీవరెడ్డి మంత్రివర్గంలో చేరాడు. 1957 లో మొదటిసారిగా రాష్ట్రమంతటా శాసనసభా ఎన్నికలు జరిగాయి. తెలంగాణాలోని 105 స్థానాలకు పోటీచేసి కాంగ్రెస్ 67 స్థానాలను పొందింది. వీటిలో 4 స్థానాలు పోటీలేకుండా గెలిచింది. ఒక్క స్థానంలో కూడా ధరావత్తు కోల్పోలేదు. ఓట్లలో సీట్లలో 1952 కంటె ఈసారి కాంగ్రెస్ పరిస్థితి మెరుగయింది.

ప్రజాసోషలిస్టు పార్టీ 27 స్థానాల్లో పోటీచేసి ఒక్క స్థానాన్ని మాత్రమే గెల్చింది. అది ఆదిలాబాద్ జిల్లాలో రాజమల్లు గెలిచిన స్థానం. 11 నియోజక వర్గాల్లో ధరావత్తు కోల్పోయింది ప్రజాపార్టీ 7 నియోజక వర్గాల్లో పోటీచేసి ఒక్కదానిలో గెల్చింది; 5లో ధరావత్తు కొల్పోయింది.

పీపుల్సు డెమోక్రటిక్ పార్టీ 64 స్థానాలకు పోటీచేసి 22ని గెలుచుకొంది. 1952 కంటె ఎక్కువ స్థానాలకు పోటీచేసినప్పటికి 1957 లో గెలుచుకొన్న స్థానాల సంఖ్య తక్కువ. నల్గొండ, ఖమ్మం, వరంగల్, కరీంనగర్ జిల్లాల్లోనే 20 స్థానాలు పొందింది. ఆదిలాబాద్, మెదక్ జిల్లాలలో ఒక్కొక్క స్థానాన్ని గెలిచింది. 1957 తర్వాత కమ్యూనిస్టుల ప్రభావం క్రమేపీ తగ్గిపోవటం మొదలయింది.

1957 ఎన్నికలు కాంగ్రెసును గట్టిపర్చాయి. 1956 పెద్ద మనుషుల ఒప్పందం ప్రకారం హైద్రాబాదు ప్రొవిన్షియల్ కాంగ్రెస్ కమిటీ 1962 దాకా విడిగా కొనసాగాలి. ఈ ఒప్పందంవల్ల తెలంగాణా ప్రాంతంలో 1957 ఎన్నికలకు అభ్యర్థులను ఎంపిక చేసే విషయంలో తెలంగాణ కాంగ్రెస్ నాయకులపై ఆంధ్ర కాంగ్రెస్ నాయకుల ప్రభావం, పెత్తనం లేకుండా ఉండటానికి వీలుంటుందని భావించారు. 1957 ఎన్నికలు ముగిసిన తర్వాత అప్పటి వరకు విడిగా ఉన్న హైద్రాబాదు ప్రొవిన్షియల్ కాంగ్రెస్ కమిటీ, ఆంధ్ర ప్రొవిన్షియల్ కాంగ్రెస్ కమిటీ విలీనం కావాలా లేదా అనే సమస్య తలెత్తింది. కాంగ్రెస్ హైకమాండ్ రాష్ట్రం మొత్తానికి ఒకే కాంగ్రెస్ ఉంటె బాగుంటుందని సలహా ఇచ్చింది. హైద్రాబాదు కమిటీ దీనికి అంగీకరించింది. కాని ప్రదేశ్ కాంగ్రెస్

కమిటీకి, తెలంగాణా ప్రాంతీయ కమిటీ ఉప భాగంగా ఏర్పరచి రాష్ట్రం మొత్తానికి ఒకే కమిటీని ఏర్పరచారు.

1957 ఎన్నికల తర్వాత సంజీవరెడ్డి తిరిగి ముఖ్యమంత్రి అయ్యాడు. ఈ సారి మంత్రి వర్గంలోకి పూర్వపు కృషీకార్ లోక్ ప్రజా పార్టీలకు ప్రాతినిధ్యం ఇవ్వలేదు. దీని ఫలితంగా కృషీకార్ కాంగ్రెస్ యునైటెడ్ ఫ్రంట్‌నుండి తొలగి పోయింది. 1958లో కాంగ్రెస్‌లో అసమ్మతీయులు కొందరు, కాంగ్రెస్ యునైటెడ్ ఫ్రంట్ నుండి బయటకు వచ్చిన పూర్వపు కృషీకార్ లోక్‌పార్టీ కలసి డెమోక్రటిక్ పార్టీని కొత్తగా ఏర్పాటు చేసారు. చెన్నారెడ్డి, లచ్చన్న దీనికి నాయకులు. ఈ పార్టీ సంజీవరెడ్డి నాయకత్వాన్ని పూర్తిగా ఎదిరించింది. ఇదే సమయంలో ప్రజా సోషలిస్టు పార్టీనుండి విడిపోయిన సోషలిస్టు పార్టీలో ఒక గ్రూపు రాష్ట్రంలో పి. వి. జి. రాజు నాయకత్వం క్రింద ఏర్పడింది. ఈ గ్రూపు డెమోక్రటిక్ పార్టీలో కలసి పోయింది. దీనితో డెమోక్రటిక్ పార్టీ సోషలిస్ట్ డెమోక్రటిక్ పార్టీగా అవతరించింది. కలగా పులగంగా ఉన్న ఈ కొత్త పార్టీ ఒక సంవత్సరం కూడ నిలబడ లేక పోయింది. దీనికి కారణాలు రెండు. ఒకటి స్వతంత్ర పార్టీ ఏర్పడిన తర్వాత సోషలిస్ట్ డెమోక్రటిక్ పార్టీలోని పూర్వపు కృషీకార్ లోక్‌పార్టీ సభ్యులు స్వతంత్ర పార్టీలో చేరడం. రెండు, సంజీవరెడ్డి అఖిల భారత కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడయ్యి రాష్ట్ర ముఖ్యమంత్రి పదవిని వదిలిన తర్వాత కాంగ్రెస్‌లోని అసమ్మతీయులు తిరిగి కాంగ్రెసులో ప్రవేశించడం. ఈ రెండు కారణాలవల్ల సోషలిస్ట్ డెమోక్రటిక్ పార్టీ అంతర్ధానమయింది.

1960లో సంజీవరెడ్డి అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షుడయిన తర్వాత హరిజన నాయకుడు దామోదరం సంజీవయ్య ముఖ్యమంత్రి అయ్యాడు. పి. వి. జి. రాజు సంజీవయ్య మంత్రి వర్గంలో చేరాడు. 1962 ఎన్నికల వరకు ఈ మంత్రి వర్గం కొనసాగింది.

## 1962 ఎన్నికలు

1962 ఎన్నికల్లో కాంగ్రెస్ అన్ని స్థానాలకు అభ్యర్థులను నిలబెట్టి, పోటీ లేకుండా పొందిన 6 స్థానాలతో పాటు మొత్తం 177 స్థానాలను పొందింది.

ఆంధ్ర ప్రాంతంలో 45.9% ఓట్లతో 113 స్థానాలు, తెలంగాణాలో 50 శాతం ఓట్లతో 64 స్థానాలను గెలుచుకొంది. ఆంధ్ర ప్రాంతానికే ఎక్కువ పరిమితమైన స్వతంత్ర పార్టి మొత్తం 140 స్థానాలకు పోటీచేసి 19 స్థానాలను గెలుచుకొంది. వీటిలో 16 ఆంధ్ర ప్రాంతం లోనివే. ఆచార్య రంగా స్వంత జిల్లా అయిన గుంటూరులో ఈ పార్టి ఒక్క స్థానాన్ని కూడా గెలుచుకోలేదు. పైగా 6 గురు డిపాజిట్లను కోల్పోయారు. గెల్చిన అభ్యర్థుల్లో 5 శ్రీకాకుళానికి, 2 విశాఖ పట్నానికి, 3 చిత్తూరుకు, 5 కడపకు, 1 కర్నూలుకు, 1 మహబూబ్‌నగర్‌కు, 1 మెదక్‌కు చెందినవారు.

కమ్యూనిస్టు పార్టి 51 స్థానాలను గెలుచుకొని ప్రధాన ప్రతి పక్షం అయింది. 51 సానాల్లో 31 స్థానాలు ఆంధ్ర ప్రాంతం లోనివి. తెలంగాణాలో 21.4శాతం ఓట్లతో 18 స్థానాలు పొందింది. తెలంగాణాలోని 18 స్థానాల్లో, 9 నల్గొండ జిల్లాలోనివి. అక్కడ అది సంపాదించిన ఓట్లు 51.2 శాతం.

ఆర్. ఎస్. ఎస్.పై ఆధారపడ్డ జనసంఘ్ 1952 ఎన్నికల్లో పోటీ చేయ లేదు. 1955 ఆంధ్రరాష్ట్ర ఎన్నికల్లో 6 సానాలకు పోటీచేసి అన్ని స్థానాలను పోగొట్టుకుంది. ఈ ఎన్నికల్లో 1శాతం ఓట్లను పొందింది. 1957 ఎన్నికల్లో తెలం గాణాలో పోటీ చేసిన రెండు స్థానాలను పోగొట్టుకుంది. 1958లో స్థాపితమయిన విధాన పరిషత్తు జనసంఘ్‌కు కొంత బలాన్ని ఇచ్చింది. ఎలననగా, శాసన పరిషత్తుకు పట్ట భద్రుల నియోజక వర్గం నుండి ఎన్నికయిన వారిలో ఒకరు జన సంఘీయుడు. శాసన పరిషత్తు ఏర్పాటైన నాటినుండి ప్రతిఎన్నికల్లోను జనసంఘ్‌కు ఒకటో, రెండో సీట్లు వస్తున్నాయి. 1962 ఎన్నికల్లో ఆంధ్ర ప్రాంతంలో 53 స్థానాలకు, తెలంగాణాలో 17 స్థానాలకు జనసంఘ్ పోటీచేసి ఆంధ్రలో 1 1శాతం ఓట్లు, తెలంగాణాలో 0 6శాతం ఓట్లు మాత్రమే పొందగల్గింది. ఆంధ్ర ప్రాంతంలో ఒక్క అభ్యర్థి తప్ప మిగిలిన అందరూ ధరావత్తును కోల్పోయినారు.

1962 ఎన్నికల తర్వాత సంజీవరెడ్డి తిరిగి రాష్ట్ర రాజకీయాలో ప్రవే శించి ముఖ్యమంత్రి అయ్యాడు. సంజీవయ్య అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షు డయ్యాడు, 1964లో రోడ్డు రవాణా కేసులో సుప్రీం కోర్టు తనకు వ్యతిరేకంగా ఇచ్చిన తీర్పు ఫలితంగా, సంజీవరెడ్డి ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశాడు. సంజీవరెడ్డి తర్వాత బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి అయ్యాడు.

## 1967 ఎన్నికలు

1961 జనాభా లెక్కల ఆధారంగా జరిగిన నియోజక వర్గాల పునర్విభజన ఫలితంగా విధానసభ స్థానాల సంఖ్య 1967 నాటికి 300 నుండి 287కి తగ్గింది. కాంగ్రెస్ పార్టీ 286 స్థానాలకు పోటీచేసి 165 స్థానాలను గెలిచింది. వీటిలో 21 స్థానాలు పోటీ లేకుండా గెలిచినవి. 1967 ఎన్నికల తర్వాత పెక్కు రాష్ట్రాల్లో కాంగ్రెస్ ఓడిపోయినా, ఆంధ్ర రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రతిష్ఠకు భంగం కలగలేదు. కాంగ్రెస్ టిక్కట్లు దొరకని కాంగ్రెస్ వాదులు కొందరు ఇండి పెండెంట్లుగా పోటీచేసి గెలిచిన తర్వాత కాంగ్రెస్‌లో చేరారు. దీనివల్ల కాంగ్రెస్ ఎన్నికల తర్వాత మరింత బలపడింది. 1967 ఎన్నికల తర్వాత పార్టీల బలా బలాల్లో చెప్పుకోదగ్గ మార్పులు కలిగాయి. శాసన సభలో మొదటిసారిగా జన సంఘ్‌కు ముగ్గురు సభ్యులతో ప్రాతినిధ్యం లభించింది. ముగ్గురు సభ్యులు విజయ నగరం, నెల్లూరు, పర్చూల నియోజక వర్గాలకు చెందినవారు. వీరిగెలుపు పార్టీ ప్రతిష్ఠ వల్లగాక, కాంగ్రెస్‌లోని అంతర్గత భేదాల వల్ల కల్గింది. స్వతంత్ర పార్టీ బలం పుంజుకొని ముఖ్య ప్రతిపక్షంగా ఏర్పడింది. 1962 కంటే 10 స్థానాలు ఎక్కువ గెలుచుకున్నా అప్పటికంటే తక్కువ ఓట్లను పొందింది. ఈసారి కూడా ఈ పార్టీ ఆంధ్ర ప్రాంతానికే పరిమితమయిందని రుజువు అయింది. మొత్తం, 89 అభ్యర్థులలో, 70 మంది ఆంధ్ర ప్రాంతంలో నిలబడ్డవారే! గెలిచిన వారందరు కూడా ఆంధ్ర ప్రాంతం వారే! ఒక్క శ్రీకాకుళం జిల్లా నుండే 10 మంది గెలిచారు.

1962లో ప్రధాన ప్రతిపక్షంగా ఉన్న కమ్యూనిస్టు పార్టీ 1964లో రెండుగా చీలి బలహీన పడింది. చీలిక ప్రభావం 1967 ఎన్నికలపై కూడా పడింది. కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి చంద్ర చంద్రరాజేశ్వరరావు, మార్క్సిస్టు పార్టీ కార్యదర్శి పుచ్చల పల్లి సుందరయ్య ఆంధ్రులు కావడం ఒక విశేషం. కమ్యూనిస్టు పార్టీ 104 స్థానాలకు, మార్క్సిస్టు పార్టీ 83 స్థానాలకు పోటీచేసి వరుసగా 11 స్థానాలను, 9 స్థానాలను పొందాయి. 1962 కన్నా తక్కువ ఓట్లను పొందాయి. 46 కమ్యూనిస్టు అభ్యర్థులు, 26 మార్క్సిస్టు అభ్యర్థులు ధరా వత్తులు కోల్పోయారు.

కమ్యూనిస్టు పార్టీలో చీలికతో పాటు, కాంగ్రెస్‌లో ఐక్యత సన్నగిల్లి

పరోక్షంగా ముఠాలు బయలు దేరాయి. ఎన్నికల తర్వాత, కాంగ్రెస్ టిక్కెట్లు దొరక్క ఇండిపెండెంట్లుగా పోటీచేసి గెలుపొందిన వారు కొత్త ముఠాలుగా ఏర్పడ్డారు. ఈ గ్రూపులో ముఖ్యమైనవి రెండు. (1) పీపుల్సు డెమోక్రటిక్ ఫ్రంటు (2) జన కాంగ్రెస్. ఎన్నికలయిన కొన్ని నెలలకు పీపుల్సు డెమోక్రటిక్ ఫ్రంటు కాంగ్రెస్‌లో చేరిపోయింది. దీనితో కాంగ్రెస్‌బలం 184కు పెరిగింది. జన కాంగ్రెస్ స్వతంత్ర పార్టీలు కలిసి 42 సభ్యుల సంఖ్యాబలంతో గౌతులచ్చన్న నాయకత్వాన డెమోక్రటిక్ ఫ్రంటుగా ఏర్పడింది. ఇది శాసన సభలో ప్రధాన ప్రతిపక్షంగా మారింది.

## 1971 మధ్యంతర లోక్‌సభ ఎన్నికలు

కాంగ్రెస్ చీలిక తర్వాత రాష్ట్రంలో జరిగిన మొదటి లోక్‌సభ ఎన్నికల్లో, ఇందిరాగాంధి నాయకత్వానగల కాంగ్రెస్ ఆంధ్రప్రాంతంలో విశాఖపట్నం, కడప, తెలంగాణాలో హైదరాబాద్, సిద్దిపేట స్థానాలకు మినహా అన్ని స్థానాలకు పోటీ చేసింది. విశాఖ పట్నంలో ఇండిపెండెంటు అభ్యర్థి పి.వి.జి. రాజును, కడపలో కమ్యూనిస్టు అభ్యర్థి ఈశ్వరరెడ్డిని, హైద్రాబాద్‌లో ఇండిపెండెంటు అభ్యర్థి బద్రుద్దీన్ తయ్యబ్జీని, సిద్దిపేటలో కమ్యూనిస్టు పార్టి అభ్యర్థి ఎ.ఆర్. దేవరాజును కాంగ్రెస్ బలపరచింది. ఆంధ్ర ప్రాంతంలో ఇందిరా కాంగ్రెస్ 25 స్థానాలను, తెలంగాణాలో 3 స్థానాలను గెలుచుకొంది. తెలంగాణాలో గెలుచుకొన్న స్థానాలు-అదిలాబాదు, ఖమ్మం, నిజామాబాదు. తెలంగాణా ప్రజాసమితి బలమయిన పోటీ దారుగా ఉండటం వల్ల కాంగ్రెస్‌కు తెలంగాణాలో బలం చేకూరలేదు. నిజలింగప్ప నాయకత్వంలోగల కాంగ్రెస్ ఆంధ్ర ప్రాంతంలో 11 స్థానాలు, తెలంగాణాలో 1 స్థానానికి పోటీ చేసింది.

తెలంగాణా ప్రజాసమితి తెలంగాణాలోని 14 సీట్లకు పోటీచేసి 10 స్థానాలను గెలుచుకొంది. గెలిచిన స్థానాలు – నాగర్ కర్నూల్, మహబూబ్ నగర్, హైదరాబాద్, సికింద్రాబాద్, సిద్దిపేట, మెదక్, పెద్దపల్లి, వరంగల్ కరీంనగర్, నల్గొండ.

కొండా లక్ష్మన్ బాపూజీ నాయకత్వంలో ఏర్పడ్డ తెలంగాణా కాంగ్రెస్ కూడా ఎన్నికలో పోటీ చేసింది. తెలంగాణా ప్రజాసమితివలె ఇది కూడా

పూర్వపు కాంగ్రెస్ వాదుల పార్టీ. ప్రత్యేక తెలంగాణా ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్నా, ఎన్నికల్లో ధరావత్తులను కూడా నిలబెట్టుకోలేక పోయింది.

మార్క్సిస్టు పార్టీ ఆంధ్రప్రాంతంలో 8 స్థానాలకు పోటీ చేసి ఒక్కదాన్ని కూడా పొందలేక పోయింది. తెలంగాణాలో 2 స్థానాలకు పోటీచేసి ఒక స్థానాన్ని (మిర్యాలగూడ) పొందింది. కమ్యూనిస్టు పార్టీ 11 అభ్యర్థులను నిలబెట్టింది. ఆంధ్రప్రాంతంలో ఒక స్థానాన్ని గెలుచుకొంది. తెలంగాణాలో పోటీ చేసిన స్థానాల్లో ఒక్కటి కూడా గెలవలేదు.

జనసంఘ్ ఆంధ్రప్రాంతంలో నిలబెట్టిన ముగ్గురు అభ్యరుల్లో ఎవరూ నెగ్గలేదు. తెలంగాణాలోని 2 అభ్యర్థులు ధరావత్తును కోల్పోయారు.

స్వతంత్ర పార్టీ 9 మంది అభ్యర్థులను నించోబెట్టింది. వీరందరూ ఆంధ్ర ప్రాంతంలోనే, స్వల్ప ఓట్లు గెలుచుకొని ఆంధ్రప్రాంతపు పార్టీగా ఉండి పోయింది.

1971లో లోక్‌సభ ఎన్నికలకు, 1972 శాసన సభ ఎన్నిలకు మధ్య కాలంలో తెలంగాణా ప్రజాసమితి కాంగ్రెస్‌లో కలిసి పోయింది. కాంగ్రెస్ నాయకులు, ప్రజాసమితి నాయకుడు చెన్నారెడ్డి మధ్య జరిగిన ఒప్పందంవల్ల బ్రహ్మానందరెడ్డి పదవి నుండి తొలగాడు. తెలంగాణా ప్రాంతీయుడు పి. వి. నరసింహారావు ఆయన స్థానంలో ముఖ్యమంత్రి అయ్యాడు. నరసింహారావు హయాంలోనే 1972 శాసన సభ ఎన్నికలు జరిగాయి.

## 1972 ఎన్నికలు

1972 శాసనసభ ఎన్నికల్లో కాంగ్రెస్ 270 స్థానాలకు పోటీచేసి 5 స్థానాలల్లో ధరావత్తును కోల్పోయింది. సంస్థా కాంగ్రెస్ 11 స్థానాలకు మాత్రమే పోటీ చేయగల్గింది. పోటీ చేసిన సానాల్లో 5 గుంటూరులో, 2 పశ్చిమ గోదావరిలో, 2 కర్నూలులో, 1 అనంతపురంలో, 1 కడపలోనూ.

1972 ఎన్నికల తర్వాత తెలంగాణా కాంగ్రెస్ పార్టీ అంతర్ధానమయింది. తెలంగాణా ప్రజాసమితి నుండి వేరుపడిన కొందరు వ్యక్తులు ఏర్పరచిన సంపూర్ణ

తెలంగాణా ప్రజాసమితి కూడా ఎన్నికల్లో పోటీచేసింది. దీనిలో సోషలిస్టులు, రిపబ్లిక్ పార్టీ సభ్యులు ఉన్నారు. తెలంగాణాలో 41 స్థానాలకు పోటీచేసి రెండు స్థానాలను (ఎల్లారెడ్డి, వర్ధన్నపేట) గెలుచుకొంది. పోటీచేసిన వారిలో 28 మంది ధరావత్తును కోల్పోయారు.

కమ్యూనిస్టు పార్టీ నిలబెట్టిన 59 అభ్యర్థుల్లో 7 గురు గెలిచారు.మార్క్సిస్టు పార్టీ నిలబెట్టిన 82 అభ్యర్థుల్లో 1 అభ్యర్థి మాత్రమే గెలిచాడు.

1973లో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కొరకు పెద్ద ఉద్యమం జరిగింది. 1974లో శాసనసభకు 6 ఉప ఎన్నికలు జరిగాయి. వీటిలో 3 ఆంధ్ర ప్రాంతం లోనివి, ప్రత్యేక ఆంధ్రోద్యమం పోరాటానికి నాయకత్వం వహించిన "జై ఆంధ్రా ఫ్రంటు" కొన్ని ఉప ఎన్నికల్లో తన అభ్యార్థులను నిలబెట్టింది, కొన్నింటిలో ఇతరులను బలపరచింది. ఏ అభ్యర్థి గెలవలేదు. ఇది ఒక విశేషం. ఈ ఉప ఎన్నికల తర్వాత ప్రత్యేక ఆంధ్రోద్యమం ఉధృతి తగ్గిపోయింది.

## 1977 లోక్‌సభ ఎన్నికలు

1977 ఎన్నికల నాటికి రాష్ట్రంలో కాంగ్రెస్ జలగం వెంగళరావు నాయకత్వం క్రింద దృఢంగా ఉంది. అత్యవసర పరిస్థితి వ్యతిరేక ప్రభావం రాష్ట్రంలో ఎక్కువగా లేకపోవటంవల్ల ఇందిరాగాంధి ప్రభావం ఎక్కువగా ఉంది. 1977 ఎన్నికల్లో కాంగ్రెస్ 42 స్థానాలకు పోటీచేసి 41 స్థానాలను గెలిచింది. జనతా పార్టి 37 స్థానాలకు పోటీ చేసింది. జనతా పార్టీ మార్క్సిస్టు పార్టీ మధ్యన పెక్కు నియోజక వర్గాల్లో ఒప్పందం కుదిరినా, విజయవాడ నియోజక వర్గంలో ఒప్పందం కుదరలేదు. అందువలన అక్కడ జనతా, మార్క్సిస్టు పోటీ చేశాయి. వీటితోపాటు కమ్యూనిస్టు పార్టీ కూడా పోటీ చేసిందక్కడ. జనతా పార్టీ రాష్ట్రంలో ఎక్కడా ధరావత్తును కోల్పోలేదు. నంద్యాల స్థానాన్ని మాత్రం గెలిచింది. మిగతా స్థానాలన్ని కాంగ్రెస్ గెలుచుకొంది.

కమ్యూనిస్టు పార్టీ 10 స్థానాలకు పోటీచేసి 8 స్థానాల్లో ధరావత్తును కోల్పోయింది. ఖమ్మం, నల్గొండ ధరావత్తులు పోని స్థానాలు. జనతా పార్టీతో పొత్తు పెట్టుకున్న మార్క్సిస్టులు 6 స్థానాలకు పోటీ చేశారు.

ఇండిపెండెంట్లుగా పోటీచేసిన 68 అభ్యర్థుల్లో హైదరాబాద్ నుండి పోటీ చేసిన సలాఉద్దీన్ ఒవైసీ తప్ప తక్కిన అందరూ ధరావత్తు కోల్పోయారు. ఇతనికి జనతా అభ్యర్థి కన్నా ఎక్కువ ఓట్లు వచ్చాయి. కాంగ్రెస్‌కు 57.37%, జనతాకు 32.3 శాతం, కమ్యూనిస్టులకు 2.67 శాతం, మార్క్సిస్టులకు 4.71 శాతం ఇండిపెండెంట్లకు 2.82 శాతం ఓట్లు వచ్చాయి. ఈ ఎన్నికల్లో 1971 ఎన్నికల కంటె 1977 ఎన్నికలు కాంగ్రెసుకు ఎక్కువ ఓట్లు రాలేదు. జనతా పార్టీకి 1977లో వచ్చిన ఓట్లు శాతం దాని పూర్వ భాగస్వామ్య పార్టీలకు 1971లో వచ్చిన ఓట్లకంటే చాలా ఎక్కువ. జనతా పార్టీ నుండి ఎన్నికైన ఏకైక అభ్యర్థి మొదట లోక్‌సభ స్పీకర్‌గా, తర్వాత రాష్ట్రపతిగా ఎన్నుకోబడటం పాఠకులకు తెలిసిందే.

1978 శాసనసభ ఎన్నికల్లో తిరిగి రెండుగా చీలిన కాంగ్రెస్ పోటీ చేసింది. ఇందిరాగాంధి నాయకత్వంలోని కాంగ్రెస్ అభ్యర్థులు అధిక సంఖ్యలో గెలిసి రాష్ట్ర నాయకత్వాన్ని చేపట్టారు.